# సనాతనం - ఆధునికత

రాణి శివశంకర శర్మ

గరిమెళ్ళ సీతారాం మరియు మహాలక్ష్మి
స్మారకోపన్యాసం 2012

తేది 18-11-2012

విశాఖపట్నం పౌరగ్రంథాలయం
విశాఖపట్నం - 530 016.

**సనాతనం - ఆధునికత**

**శ్రీ రాణి శివశంకర శర్మ**


ముద్రణ : **2012**

ప్రతులు : **300**

వెల : **అమూల్యం**

ప్రతులకు : **విశాఖ పౌరగ్రంథాలయం**

**ద్వారకానగర్, విశాఖపట్నం-530016.**

ఫోన్ : **0891-2719009**

ముద్రణ :

**సత్యం ఆఫ్‌సెట్ ఇంప్రింట్స్**

బృందావనం, డో.నెం. 49-28-5,

గ్రౌండ్‌ఫ్లోర్, ఫ్లాట్ నెం. జి1 & జి2,

మధురానగర్, విశాఖపట్నం - 16.

ఫోన్స్ : 2735878, 6648538

# సనాతనం - ఆధునికత

– రాణి శివశంకర శర్మ

సంపద అంటే యేమిటి అన్న ప్రశ్నకి మనం యిచ్చుకొనే సమాధానంలో వచ్చిన మార్పే ఆధునికతకి మూలం. సంపద అంటే డబ్బు, మనీ, ధనమూలమిదం జగత్ అని శ్రీరామచంద్రుడే రామాయణంలో బోధించాడుకాని సంపద డబ్బుకి సమానార్థకం కాదు. అష్టలక్ష్ములలో ధనలక్ష్మి వొకానొకటి మాత్రమే. ధనమే సర్వం సర్వస్వం కావడమే ఆధునికతకి మూలం. యిది జీవలక్షణంపై పెద్ద దెబ్బ. యిదే జీవుని వేదన.

సర్వమూ అమ్మదగినదే కొనదగినదే. ప్రతీదీ సరుకే. యీ భావనే వలసవాదంనుంచి ప్రాదుర్భవించిన ఆధునిక భావన. యీ సరుకుల తత్వమే గురజాడ దేశభక్తి గీతంలో ప్రధానాంశం.

సరుకులతో అన్నిదేశాల్ క్రమ్మవలెనని, దేశి సరుకులని అమ్మి దండిగా డబ్బు చేసుకోవాలని నవయుగ వైతాళికుడు గురజాడ పిలుపునిచ్చాడు.

డబ్బులేనట్టి నరులకు
కీర్తిసంపదలబ్బవోయ్

అంటూ దేశం యొక్క జీడీపీ రేటు గురించి చాలా కాలం క్రితమే మాట్లాడాడు గురజాడ.

పోటీతత్వంలో కూడిన వ్యాపారమే విజయ రహస్యమన్నాడు. వైరములు వాణిజ్యమందే అన్నాడు. అంటే వాణిజ్య వైరాలు అభివృద్ధి కరమైనవీ, ప్రగతిశీలమైనవీ. వాణిజ్య శత్రుత్వాలు రెండు ప్రపంచయుద్ధాలకి కారణమైన మాట నిజమే కాని మన టెక్నాలజీకంతా మూలం యుద్ధకాలంలో సాగిన వైజ్ఞానిక కృషే కారణం. పేరుకి ప్రపంచ యుద్ధాలు ముగిసాయి కాని సోవియట్ అమెరికా ప్రచ్ఛన్న యుద్ధం, అమెరికా గల్ఫ్ యుద్ధం మీదుగా వాణిజ్యం యుద్ధతంత్రంగా కొనసాగుతూనే వస్తోంది.

అసలు యింగ్లీషువాళ్ళు భారతదేశం వచ్చింది వ్యాపారం పేరుమీదే. వారు కూడా 1857 సిపాయిల తిరుగుబాటుని తీవ్రంగా అణచి, హింసని ప్రయోగించి తమ వ్యాపారాన్ని విస్తరించుకోగలిగారు. వ్యాపారమూ, అధికారమూ రెండూ తోబుట్టువులని నిరూపించారు.

గురజాడలాంటి వైతాళికుల దృష్టిలో వాణిజ్య హింస హింస కాదు. వాణిజ్యవైరం వైరం కాదు. వలసవాదం కూడా అభివృద్ధికి రాచబాటే కాని అది రాచపుండుకాదు. అందుకే జార్జి ప్రభువుని చక్కగా కొనియాడాడు.

భరతమాతకి ప్రథమ పుత్రుడు వలసవాదే. అందుకే తల్లిభారతమాత జార్జి చక్రవర్తికి ఆరోగ్య సంపదలు వెల్లువగా యివ్వాలని కోరుకున్నాడు గురజాడ.

భరతఖండం యెప్పుడూ యెరుగని శాంతిని పొందింది వలస వాదుల కాలంలోనేనంటాడు గురజాడ. నిర్మలమైన నీతీ, ధర్మమూ మనకు అబ్బింది క్రైస్తవ ప్రభువుల వల్లనే. అందుకే మంచి గతమున కొంచెమేనోయ్ అంటాడు.

జార్జి ప్రభువుని కలలోకూడా విస్మరించడు గురజాడ. దేశభక్తి అంటే వలసవాద భక్తే, ఆంగ్లేయ భక్తే, నిజమైన అర్థం అదే.

అందుకే 'జనగణమన అనే దేశభక్తి గీతాన్ని రచించిన కవిరాజు రవీంద్రనాథ్ ఠాగూర్‌నీ జార్జి చక్రవర్తినీ కలిపి యిద్దరు రాజులు అనే వ్యాసం రాశాడు గురజాడ. అందులో బెంగాలు విభజన నాటి కల్లోల పరిస్థితుల్ని ఆలుమగల కయ్యంగా పోల్చాడు. అంతేకాని, అందులో ఎటువంటి అణచివేత కానరాలేదు గురజాడకి. జార్జి చక్రవర్తిని దయాళువు అన్నాడు. (అసలు ఠాగూర్ రాసిన జనగణమన గీతమే జార్జి చక్రవర్తి స్తోత్రగీతం అంటారు).

నిజానికి దేశభక్తి అంటే ఆంగ్లేయ భక్తి, వలసవాద భక్తి, సామ్రాజ్యవాద భక్తి అనే అర్థాన్ని రూఢి చేశారు వైతాళికులు.

ఇందుకు బంకించంద్రుని నవలే ఆధారం.

## దేశభక్తి - ఆంగ్లేయ భక్తి

వందేమాతరం గీతకర్త బంకించంద్ర చటర్జీ భారతీయ సనాతన ధర్మాన్ని రక్షించడానికే ఆంగ్లేయులు అవతరించారు అంటాడు. ఇంగ్లీషువాళ్ళు సంతాలుల తిరుగుబాటుని అణచివేశారు. ఆ అణచివేతని సమర్థించాడు బంకించంద్రుడు. హిందూధర్మ స్థాపనకూ, హిందువుల పునరుజ్జీవనానికీ బ్రిటీష్ రాజ్యస్థాపనే శరణ్యం.

ఆంగ్లేయులు మిత్రులు వారివల్ల భూమి సస్యశ్యామలం అవుతుంది అని రాశాడు బంకించంద్ర ఆనందమఠం నవలలో. సంపదకీ, శాంతికీ, ధర్మానికీ, నీతికీ చట్టానికీ ఆంగ్లేయులు మూలం అనే భావాన్ని వ్యాపింపజేశారు యిలాంటి మేధావులు. వీళ్లే మన వైతాళికులు. మరి భారతీయుల కర్తవ్యం ఏమిటి? ఆంగ్లేయ శాసనాల్ని శిరసున దాల్చడమే. అన్ని రంగాల్లో ఆంగ్లేయ బానిసత్వమే, భారతీయులకి విముక్తినిస్తుంది. యిదే గురజాడ లాంటి వైతాళికుల సందేశం.

జార్జి సామ్రాట్ శాసనంబుల
జాజిపూవుల దండమాడ్కిని
రాజరాజులు శిరములందున
దాల్చి మనవలయున్.

మరి గురజాడ సందేశాన్ని మనం యిప్పుడు యెలా అమలు చేయాలి? ప్రత్యక్ష ఆంగ్లేయ ప్రభుత్వం లేదు కదా? యిప్పుడు మనం చేయాల్సింది అమెరికా కనుసన్నల్లో మెలగడం, అమెరికన్ బానిసత్వం. జార్జిని జార్జిబుష్‌గా అనువదించుకొంటే సరిపోతుంది. యిప్పుడు మనం చేస్తున్నది కూడా అదే. అణుఒప్పందాల్లో, చిల్లర దుకాణాల్ని కూడా బహుళజాతి కంపెనీలకి అప్పజెప్పడంలో జార్జి భక్తే కదా కనిపిస్తున్నది?

అన్ని వాదాలూ యీ జార్జి ప్రభుభక్తి నుంచి, వలసవాద బానిసత్వం నుంచి ఆవిర్భవించాయి.

అందుకే నేటి దళిత మేధావులు కూడా అమెరికా సామ్రాజ్యవాదం నుంచే విముక్తి లభిస్తుందని బహిరంగంగానే ప్రకటిస్తున్నారు. అఫ్ఘనిస్తాన్‌మీద అమెరికా

బాంబుదాడులు చేసినపుడు అది విముక్తి యుద్ధం అన్నారు చంద్రభాను ప్రసాద్ దళితుడి డైరీ అనే కాలంలో.

1857 తిరుగుబాటులో దళిత సిపాయీలు తిరగబడకపోవడమే కాదు, ఆంగ్ల ప్రభుత్వానికి సహకరించారు. కనుక వారికి సైన్యంలో తగిన స్థానం కల్పించాలని ఆంగ్లేయుల్ని వేడుకొన్నాడు అంబేద్కర్. స్వాతంత్ర్యానంతరం అమెరికా స్నేహం కోసం తపించాడు.

నేడు దళితవాదులు ఇంగ్లీషుతల్లి బొమ్మలు పెట్టి పూజిస్తున్నారు.

దీనికి మూలం వైతాళికుల్లోనే వుంది. సంస్కృతభాష వర్ధిల్లాలంటే పాశ్చాత్య జాతికి చెందిన ప్రొఫెసర్నే నియమించాలన్నాడు గురజాడ. ఆంగ్లేయులే మనవైన భాషల్నీ విద్యల్నీ ఉద్ధరించగలరని, వారి బోధనా పద్ధతులే విధానాలే మనకి శిరోధార్యాలని భావించాడు గురజాడ. అంటే ఆంగ్లేయ దృష్టితో మనని మనం వీక్షించుకోవాలి. వారి కళ్లద్దాలతో మనని మనం పరిశోధించుకోవాలి. మనం వట్టి వెధవాయిలం. యిదీ వైతాళికులవాదం.

## డీకలొనైజింగ్ మైండ్

యిప్పుడు మన మెదళ్ళని యీ వలసవాద వైతాళికులనుంచి విముక్తం చెయ్యాలి. జార్జి భక్తినుంచి విముక్తం చెయ్యాలి. 'గుగీ' అనే ఆఫ్రికా రచయిత యింగ్లీషులో రచన చెయ్యడం మహాపాపం అని భావించాడు. తనదైన గిరిజన 'గికూ' భాషలో రచన ప్రారంభించాడు. ఐతే మన వైతాళికుడు గురజాడ ఆంగ్ల రచయిత కావాలనుకొన్నాడే కాని తెలుగు రచయిత కావాలని సంకల్పించనేలేదు. అంబేద్కర్ యింగ్లీషులోనే రచనలు చేశాడు.

డచ్ దేశీయుడైన ఫ్రిట్స్ స్టాల్ అనే పండితుడు భారతీయ వేదవిద్యల్ని భారతీయ ఋషుల దృష్టిలోంచే దర్శించాలన్నాడు. 1995లో నంబూద్రి బ్రాహ్మణుల్ని కలిసి, అగ్ని చయన యాగాన్ని అధ్యయనం చేసి 'అగ్ని' అనే బృహత్ సంపుటాన్ని వెలువరించాడు. స్థానిక సంస్కృత పండితులలోని ఒరిజినాలిటీని గుర్తించాడు. అనేక ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు పాణిని వ్యాకరణంలోనే వున్నాయన్నాడు.

మనం సంస్కృతాన్ని కూడా విదేశీయులనుంచి ఆంగ్లేయులనుంచి నేర్చుకోవాలని గురజాడ అన్నాడు. అంటే, ఆంగ్లేయులు తమ సంకుచితత్వాన్ని అధిగమించగలరు. మనం మాత్రం అధిగమించలేం. అందుకే మనం తిరుగుబాటు చేయవలసింది సామ్రాజ్యవాదం మీద కాదు, వలసవాదం మీద కాదు, వలస వాదాన్ని సామ్రాజ్యవాదాన్ని జీర్ణం చేసుకొన్న భారతీయ బానిస బుద్ధులమీద, వైతాళికులమీద.

## బానిసబుద్ధులపై మహిళ తిరుగుబాటు.

భారతీయ బానిస మనస్తత్వంపై తిరుగుబాటు చేసిన వీరనారి బెంగుళూరు నాగరత్నమ్మ.

ఆంగ్లేయులు రాసిన బూతుకథల్ని అనువాదం చేసి వదిలిన వైతాళికుడు వీరేశలింగం గారికి ముద్దు పళని 'రాధికా సాంత్వనం'లో మాత్రం బూతు కనబడింది. రాధాకృష్ణుల ప్రణయాన్ని వర్ణించింది ముద్దుపళని.

యీ కావ్యాన్ని, దేవదాసి బెంగుళూరు నాగరత్నమ్మ ప్రచురించారు. దానికి ప్రశంసా వాక్యాలు కూడా రాశారు. ఆంగ్లేయుల కొలువులో పరపతి సంపాదించిన వీరేశలింగం పంతులు యీ కావ్యాన్ని నిషేధింపజేశారు.

వీరేశలింగం ఆంగ్లేయులకే మూఢభక్తుడు. జాతీయ వాదానికి తీవ్ర వ్యతిరేకి. జాతీయ వాదుల సభలకి వెళ్ళినా, జాతీయ వాదుల పటాలు యింట్లో తగిలించుకున్నా అనుయాయులపై తీవ్రంగా విరుచుకుపడేవాడు. తాను నడిపే పాఠశాలలో ఇంగ్లీషు రాణి ప్రార్థనాగీతం రోజూ పాడించేవాడు. యీశ్వరేచ్ఛ వలన ఆంగ్లేయులు మనకి ప్రభువులై ధర్మాన్ని నిలిపారని కీర్తించేవాడు. అంటే బానిసకొక బానిసకి ఆంగ్లేయుల మద్దతు వుండడంలో ఆశ్చర్యమేముంది. అందుకే ఆయన మద్దతుతో రాధికా సాంత్వనం నిషేధానికి గురైంది. కాని వీరేశలింగంగారి యింగ్లీషు అనువాద బూతు పుస్తకాలపై మాత్రం నిషేధం లేదు. ఇదీ ఆంగ్లేయ నీతి.

వీరేశలింగంపై తిరుగుబాటు జండా యెగరవేసి మూడు చెరువులు నీళ్లు తాగించిన దేవదాసి నాగరత్నమ్మ, దేవదాసి వ్యవస్థ రద్దుని కూడా వ్యతిరేకించారు. జీవితాంతం తనని తాను దేవదాసిగా గర్వంగా ప్రకటించుకొన్నారు. దేవదాసి వ్యవస్థ రద్దు

పేరుతో సంస్కృతి, ఆస్తి హక్కులపైన జరుగుతున్న దాడిని యెదుర్కోవడానికి ప్రయత్నించారు.

అసలు దేవదాసి అంటే యెవరు? సాక్షాత్తూ దేవుని భార్య. ఆమె నిత్య సుమంగళి. ఎందుకంటే దేవునికి మరణం లేదు.

భారతీయతత్వంలో దేవుడికీ, జీవుడికీ దగ్గరతనం యెక్కువ. అందుకే దేవుడు ప్రభువుగా నిలిచిపోడు. అతడు ప్రియుడు కాగలడు. అతనిలో మధుర శృంగార ప్రణయం సాధ్యమే. అందుకే దేవుడి చుట్టూ అంత శృంగార సాహిత్యం! దేవుడు నా ప్రియుడు, సఖుడు అన్న దగ్గర నుంచి దేవుడే నేను, త్వమేవాహం వరకు యీ ప్రేమతత్త్వం సాగుతుంది. యీ తత్వమే దేవదాసీ వ్యవస్థకు మూలం. యిట్టి దేవదాసినే విశ్వనాథ సత్యనారాయణగారు వేయి పడగలు నవలలో కళాత్మకంగా చిత్రించాడు.

క్రైస్తవం ప్రకారం దేవుడూ జీవుడూ, పూర్తిగా వేరు వేరు. దేవుడు ప్రభువు మాత్రమే. పైగా శృంగారం పాపం, నీచం, దైవ ధిక్కారం. యీ దృష్టిలోంచి శృంగారం పాపంగాను అదైవికంగానూ భావించబడింది. దీంతో తాత్వికంగా, దేవదాసీ వ్యవస్థ నిషేధార్హంగా పరిగణించబడింది.

నృత్య నాట్యాలతో ఆరాధించబడిన 'రసోవైస:- అనే రసస్వరూపుడైన దైవం కాస్తా క్రైస్తవీకరించబడ్డాడు. మనం దేవుణ్ణి చూసే దృష్టిలో కూడా మార్పు వచ్చింది. యిదే దేవదాసీ వ్యవస్థ పట్ల వ్యతిరేకతకి ముఖ్య కారణమైంది. (యీనాడు షిరిడీ సాయిబాబాలూ, అయ్యప్ప స్వాములూ ప్రధాన దైవాలుగా అవతరించడానికి యీ దృష్టి మార్పే కారణం.)

## బ్రాహ్మణ వాదం - దళిత వాదం

వలసవాదులు చేసిన ముఖ్యమైన మిషనరీ యాక్టివిటీ యేమిటో తెలుసా! బ్రాహ్మణుల్ని, ఆంగ్ల విద్యా సంపన్నుల్ని చెయ్యడం. దుబాసీలుగా అవతరించిన బ్రాహ్మణులు క్రైస్తవాన్ని బ్రాహ్మణీకరిస్తూ, బ్రాహ్మణ్యాన్ని క్రైస్తవీకరిస్తూ చివరికి సకలం బ్రాహ్మణమయం చేసేశారు. ప్రతీదాన్నీ బ్రాహ్మణీకరించారు.

వలసవాదులు హయాంలోనే బ్రాహ్మణులకి ఎక్కడలేని ప్రాముఖ్యత వచ్చింది.

దేవాలయాల్లో చాలాచోట్ల శూద్రులు పూజారులుగా వుండేవారు. అన్నిచోట్లా బ్రాహ్మణులు నిండిపోయారు. ఏకులానికి ఆకులం ఏ తెగకి ఆ తెగ చట్టాలూ న్యాయాలూ వుండేవి. బ్రాహ్మణ స్మృతిగ్రంథాలు యింగ్లీషులోకి రావడంతో హిందూ చట్టం అనేది యేర్పడింది. (హిందూ సామ్రాజ్యవాద చరిత్ర – ధర్మతీర్థ)

జనాభా లెక్కలు తీశారు యింగ్లీషువాళ్లు. దానికోసం బ్రాహ్మణస్మృతి గ్రంథాల్లోని నాలుగు వర్ణాల వ్యవస్థలోకి అన్ని కులాల వాళ్ళనీ యిమడ్చడానికి ప్రయత్నించారు. అంతక్రితం యిటువంటి వ్యవస్థ గురించి చాలామంది ప్రజలకి తెలియదు.

యీ విధంగా బ్రాహ్మణ గ్రంథాలకి ఎక్కడలేని ప్రాశస్త్యం తెచ్చింది బ్రిటీషువాళ్లే. వాటిని అటక దించి అనువాదం చేయించి ఎక్కడలేని ప్రాశస్త్యం తెచ్చింది యింగ్లీషువాళ్లే. కొందరు దళితులు ఆగ్రంథాలని తగులబెట్టి మరింత ప్రాచుర్యాన్ని కల్పించారు. యీవిధంగా వైరభక్తిని నిరూపించుకొన్నారు.

ఇదిగో, యీ విధంగా బ్రాహ్మణుడు ఆంగ్లేయులచేత రీయిన్వెంట్ చేయబడ్డాడు. అతడు సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపిగా చేయబడ్డాడు. యీపని ముస్లింలు చేయలేదు. క్రైస్తవ ప్రభువులే చేశారు. బ్రాహ్మిణ్ రీయిన్వెంటెడ్

దేవదాసీ వ్యవస్థ, వివిధ కులాచారాలు, కుల సంస్కృతులు, కుల చట్టాలు అన్నిటినీ రద్దు చేసి వొకే ఏకఛత్రాధిపత్యం కిందికి తీసుకురావడం కోసం బ్రాహ్మణుణ్ణి ఇన్వెంటు చేశారు ఇంగ్లీషు వాళ్లు. బ్రాహ్మణవాదం యింగ్లీషు వాళ్ల సృష్టి.

చిన్న ప్రశ్న. భరతనాట్యం ఎవరిది? బ్రాహ్మణులది అని అజ్ఞానులు మాత్రమే అంటారు. అది దేవదాసీలది. సంగీతం, సాహిత్యం కులపురాణాలు అనేకం బ్రాహ్మణేతరుల్లో విరాజిల్లేవి.

**కూర్మ పురాణం ఏమంటోంది**

**భారతేతుస్త్రియః పుంసః**
**నానావర్ణాః ప్రకీర్తితాః**
**నానాదేవార్చనే యుక్తాః**
**నానా కర్మాణి కుర్వతే**

అందుకే నానాత్వం బహుళత్వం భారతీయ లక్షణం. యీ బహుళత్వాన్ని పలచన చేసి ఒకే బ్రాహ్మణ పద్ధతిలోకి అన్ని కళల్నీ పద్ధతుల్నీ తీసుకురావడం మొదలైంది. యిదే బ్రాహ్మణ వాదానికి బీజం. దీనితో భరతనాట్యం వంటి వాటిని బ్రాహ్మణులు అభ్యసించడం మొదలుపెట్టారు. వాటి స్వరూప స్వభావాల్ని మార్చివేసి బ్రాహ్మణీకరించారు.

## బ్రాహ్మణవాదం నుంచే దళితవాదం

కులవృత్తులూ కుల సంస్కృతులు ధ్వంసం కావడంతో దళితులు కూడా బ్రాహ్మణుల్ని అనుకరించడం మొదలుపెట్టారు.

మొట్టమొదట ఆంధ్రదేశంలో మతాంతరీకరణల్ని శక్తివంతంగా తిప్పికొట్టింది దళితులే. మాలదాసరులు తమ సామాజిక హెూదా జీవన భృతులను కోల్పోతున్నామన్న భయంతో మతాంతరీకరణని వ్యతిరేకించారు. ('ఆంధ్రుల చరిత్ర' – బి.ఎస్.ఎల్. హనుమంతరావు)

గిరిజనులు కూడా గొప్ప తిరుగుబాటు చేశారు. బిర్సాముండా అనే గిరిజన యువకుడు తాను సూర్యుని అవతారమని ప్రకటించుకొన్నాడు. ఆవిధంగా వైదిక సూర్య ఆరాధనని పునరుజ్జీవింప జేశాడు. క్రైస్తవ మిషనరీల కార్యకలాపాల్ని బలంగా అడ్డుకొన్నాడు. క్రైస్తవమతంలోంచి మారిన కుటుంబాన్ని వెలివేసిన గిరిజన తెగ గురించి హేమండార్ఫ్ వ్రాశాడు.

యీ విధంగా గిరిజనులూ దళితుల నుంచి మొట్టమొదట వలస క్రైస్తవ సంస్కృతికి ఎదురు దెబ్బ తగిలింది.

కాని బ్రాహ్మణులు పరోక్షంగా క్రైస్తవీకరించబడ్డారు. బెంగాలులాంటిచోట్ల మైఖేల్ మధుసూదనదత్తులాంటివాళ్లు ప్రత్యక్షంగానే క్రైస్తవాన్ని స్వీకరించారు. కాని పరోక్ష క్రైస్తవీకరణే సంస్కృతిలో తీవ్రమైన మార్పులకి కారణమైంది.

కల్చరల్ సింబల్స్ సాంస్కృతిక సంకేతాలూ, పురాణాల్లో, అన్నిటినీ కూడా క్రైస్తవ దృష్టితో తిరస్కరించారు గురజాడలాంటి వైతాళికులు. వలస వాదాన్ని వలస ప్రభువుల్నీ వలస నీతినీ కీర్తించారు. యీ ప్రచ్ఛన్న క్రైస్తవులైన బ్రాహ్మణులనుంచే ఆధునిక

దళితవాదానికి బీజాలు పడ్డాయి. అడుగు జాడలు ఏర్పడ్డాయి.

## బ్రాహ్మణుల ప్రచ్ఛన్న క్రైస్తవం

'వెర్రి పురాణ గాథలు నమ్మజెల్లునె పండితుల్' అంటూ గురజాడలాంటి ఆంగ్ల మానసబుద్ధులు పురాణాల్ని ఊహల్నీ కల్పనల్నీ వట్టి మూఢవిశ్వాసాలుగా కొట్టివేశారు.

తోకచుక్కని అరిష్టంగా భావిస్తారు భారతీయులు. గురజాడ తోకచుక్కని సంఘ సంస్కరణ ప్రతీకగా చిత్రించాడు. అంటే జనులలో పాతుకుపోయిన విశ్వాసాన్నికాదని కొత్త విశ్వాసాన్ని కల్పించాడు. ఎందువల్ల? భారతీయులు వస్తుతత్వం కాంచలేని వాళ్లు అందువల్ల వారి నమ్మకాల్ని మూఢ విశ్వాసాలుగా కొట్టివేయాలి. మరి యెవరిని ప్రమాణంగా తీసుకోవాలి! ఆంగ్లేయుల్ని. 'కన్నుగానని వస్తు తత్వము, కాంచ నేర్పరులింగిలీజులు'.

ధర్మం అనే ప్రాచీన పదం కూడా జార్జి ప్రభువుకి విశేషణంగా మారిపోయింది, గురజాడ చలువవల్ల. ధర్మం అంటే నిలిపివుంచేది అని అర్థం. యిప్పుడు మనని నిలిపి వుంచేది ఆంగ్లేయులే కదా మరి!

## పిచ్చి చరిత్రపాఠాలు

పురాణాల్ని వెర్రిపురాణాలుగా కొట్టివేసిన ఆంగ్ల మానసపుత్రులు చరిత్రని ప్రమాణంగా భావించడం మొదలుపెట్టారు. యీ చరిత్ర పాఠాల్ని ఆంగ్లేయులనుంచే నేర్చుకొన్నారు అని వేరే చెప్పక్కర్లేదు.

జేమ్స్ మిల్ అనే చరిత్రకారుడు మొత్తం చరిత్రని హిందూ, ముస్లిం, బ్రిటీషు యుగాలుగా విభజించాడు. మిగిలిన రెండింటినీ మతపరంగా ప్రస్తావించినా, క్రైస్తవ యుగం అని కాక బ్రిటీష్ యుగం అన్నాడు. సెక్యులరిజం అంటే క్రైస్తవమని అతని ఉద్దేశ్యం కావచ్చు.

ఈ చారిత్రక విభజన చరిత్రని తీవ్రమత ఘర్షణగా చిత్రించింది. దీనివల్ల హిందూ ముస్లింలు పూర్తి శత్రుత్వంలో కూడిన జాతులుగా భావించబడింది. యీ చరిత్ర ప్రభావం బ్రాహ్మణులనుంచి దళితుల వరకు అందరిమీద పడింది.

బ్రిటీషువారు ధర్మప్రభువులని వారు ముస్లింలనుంచి హిందువులని రక్షించారని భారతీయ మేధావులు భావించారు. బంకించంద్ర అలాగే భావించాడు. చివరికి బహుజన మేధావి జ్యోతిరావు పూలే కూడా అలాగే భావించాడు. అందరూ విద్య నేర్చింది అంటే చరిత్ర పాఠాలు నేర్చింది యింగ్లీషు వాళ్లవద్దనే కదా!

'శివాజీ పోవడ'లో ముస్లింలను గూర్చి జ్యోతిరావుపూలే యిలా రాశాడు.

**కాబూల్ వదిలి సింధులో మునిగి**
**గడ్డం ధరించి, హిందువుల వేధించి**
**బ్రాహ్మల పిలక గొరిగి, అవయవాలు తరిగి**
**శివలింగాలు పగలగొట్టి ఆలయాలు కూలగొట్టి**
**గొడ్డు మాంసం తిని, పందులను వదిలి**
**చిత్ర పఠాలను చించేసి, శిల్పాలను ధ్వంసించి**
**ఆలయాలు కూల్చేసి, మినార్‌లు నిర్మించి**
(ధనంజయకీర్, ఫాదర్ ఆఫ్ ఇండియన్ రివల్యూషన్)

యీ కవితలో జ్యోతిరావుపూలే బ్రాహ్మల ఆచార వ్యవహారాల గురించి, శివలింగాల గురించి, ఆలయాల గురించి చాలా ఆదుర్దాపడ్డాడు.

నిజానికి జ్యోతిరావుపూలే లాంటివారి దృష్టిలో బ్రాహ్మలు కూడా విజాతీయులే, విదేశీయులే. వాళ్లు ఆర్య సంతతి. స్థానిక నల్లజాతి వాళ్లని అణచివేసిన వాళ్లు. వామనుడు బలిచక్రవర్తిని మూడోపాదంతో అణచివేసిన కథ బ్రాహ్మణ ఆధిపత్య స్థాపనని నిరూపిస్తోంది అని చరిత్ర అల్లాడు జ్యోతిరావుపూలే.

మరి ముస్లింలు దుర్మార్గులు, విజాతీయులు బ్రాహ్మలు దుర్మార్గులు విజాతీయులు. మరి స్వదేశీయులెవరు?

బ్రాహ్మణ సనాతన ధర్మాన్నీ, యిస్లాంనీ మినహాయించి వొక విశాల ఐక్యజాతీయ వాదాన్నీ నిర్మించడమే యిట్టి మేధావుల ఉద్దేశ్యం. అదే హిందూ జాతీయవాదం. యీ హిందూ జాతీయ వాదానికీ బ్రాహ్మణ సంస్కృతికీ యేమీ సంబంధం లేదు.

(జాతీయతత్వం ఒళ్లో మతతత్వం కొమర్రాజు రచనల పరిశీలన – ఎస్. మహబూబ్ భాషా రాసిన వ్యాసం)

## హిందుత్వని వ్యాపింపజేస్తున్న దళితవాదం

హిందుత్వ అనే పదాన్ని సృష్టించిన వీరసావర్కర్ పూర్తి నాస్తికుడు. ఆయన బ్రాహ్మణ సనాతన ధర్మానికి పాతరవేసి హిందూవాదాన్ని వ్యాపింపజేశాడు. అంబేద్కర్ కూడా ముస్లింలూ, హిందువులూ శత్రుజాతులనీ యెప్పటికీ కలవలేరన్నాడు. ముస్లింలని పూర్తిగా దేశం నుంచి సాగనంపకపోతే దేశభద్రతకే ముప్పు అన్నాడు. (పార్టిషన్ ఆఫ్ ఇండియా – అంబేద్కర్)

ఐతే ద్విజాతి సిద్ధాంతాన్ని సనాతన బ్రాహ్మణులు ఖండించారు. బ్రిటీష్ పరిపాలనా కాలంలో జీవించిన శృంగేరీ పీఠాధిపతి శ్రీ చంద్రశేఖర భారతీస్వామివారు ముస్లింలను దుర్మార్గులుగా క్రూరులుగా చిత్రిస్తున్న చరిత్రని తీవ్రంగా ఖండించారు. యిటువంటి పుక్కిటి చరిత్రలని నమ్మవద్దన్నారు. టిప్పు సుల్తాన్ వంటి ముస్లిం ప్రభువులు, హిందువుల దౌర్జన్యాల నుంచి కూడా బ్రాహ్మణ సంస్కృతినీ పీఠాలనీ కాపాడారని సోదాహరణంగా వివరించారు. బ్రాహ్మణులకి మంత్రి పదవులిచ్చి ఆత్మీయంగా ఆదుకొన్నారన్నారు. యీ చరిత్ర పాఠాలన్నీ ఆంగ్లేయుల కల్పనలేనని కొట్టివేశారు చంద్రశేఖర భారతీస్వామి (ది లాస్ట్ బ్రాహ్మిణ్) వారు.

జ్యోతిరావుఫూలే, ముస్లింలని దుర్మార్గులుగా చిత్రిస్తుంటే, సనాతన పండితులు మాత్రం ముస్లింలని ప్రేమించారు ఆరాధించారు. గురజాడ కూడా మతోన్మాదులుగా చిత్రించాడు. (మతము – విమతము)

హిందూ – ముస్లింలు అనే రెండు జాతులప్రసక్తి ఆధునిక చరిత్ర భావన నుంచి పుట్టింది. దానికి దళితవాదులు బలాన్ని చేకూర్చారు. ముస్లింలూ – బ్రాహ్మణులూ యిద్దరూ అనాగరికులూ, క్రూరులని ప్రచారం చేశారు దళితవాదులు.

మరి యెవరు శాంతి కపోతాలు, కరుణ శీలురు! యింగ్లీషువాళ్లు, క్రైస్తవులు, వారే ధర్మ ప్రభువులు.

వారు భారతీయులను చంపేసి, అణచివేసి అజాతశత్రువులై, శాంతిస్థాపన చేశారని మెచ్చుకున్నారు గురజాడ....

**"కొల్లబోతగ, చంపి శత్రుల ఢిల్లి పట్టం గట్టిబలిమిని**
**తొల్లి నల్లని దేవుడొక్కడు అజాతశత్రునకున్"**

అజాతశత్రువు అంటే: ఆధునిక ధర్మరాజు జార్జి చక్రవర్తికి నల్లని దేవుడు శ్రీకృష్ణుడే స్వయంగా హస్తిన సింహాసనం దక్కేలా చేశాడంటున్నాడు గురజాడ. భారతేయులే కౌరవులు.

(జార్జి ప్రభువు చేతుల్లో చావు మూడిన శత్రువులు భారతీయులే) అంటే గురజాడకు కూడా శత్రువులు భారతీయులే.

## హిందూమతం ప్రచ్ఛన్నక్రైస్తవం

బ్రాహ్మణ ద్వేషానికీ, ముస్లిం ద్వేషానికీ దగ్గర సంబంధం వుంది.

హిందూ, ముస్లిం యుగాలు మతపరమైనవిగా వర్గీకరించబడ్డాయి ఆంగ్లేయుల చేతిలో. యింగ్లీషువాళ్లే మతాతీతులు.

"మతములన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును".

"ఆంగిలేయుల ధర్మరాజ్యము, సంతతము వర్ధిల్లు గావుత" అంటే యింగ్లీషువాళ్ల పాలన, వారి సామ్రాజ్యం విస్తరిస్తుందనే అర్థం. జార్జి ప్రభువు పరిపాలన విస్తరిస్తుందని అర్థం. మార్క్సు కూడా ముస్లింలకన్న, యింగ్లీషువాళ్లు జయించడం మంచిదైందన్నాడు. వారు పెట్టే చిత్రహింసలు కూడా ధర్మరాజ్యానికి దారితీస్తాయి అన్నాడు.

అందువల్ల సనాతన అస్తిత్వాలకి ప్రతినిధులుగా భావించబడ్డ బ్రాహ్మణ – ముస్లింల స్థానంలో వొక నూతన అస్తిత్వాన్ని స్థాపించాలి. అదే హిందూ వాదానికి మూలం. యీనాడు హిందూ వాదానికి బ్రాహ్మణేతరులే ప్రతినిధులు కావడానికి కారణం యిదే.

నిజానికి బ్రిటీష్ పూర్వ భారతదేశంలో అస్తిత్వాలు చాలా బహుళమైనవి. వాటిలో బ్రాహ్మణుడు వొక్కడు మాత్రమే. క్రైస్తవ ప్రభువులు బ్రాహ్మణుణ్ణి మొత్తం సమాజానికి ప్రతినిధిగా మార్చి అతని అస్తిత్వాన్ని సార్వజనీనం చేశారు. అది క్రైస్తవుల కుట్ర.

బ్రిటీష్ కొలువుకూటంలో పాతుకుపోయిన బ్రాహ్మణునికి వ్యతిరేకంగానే బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలు పుట్టాయి.

అంటే ఆధునిక బ్రాహ్మణుడికి వ్యతిరేకంగానే బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలు పుట్టాయి. ఆక్రమంలో అతని మొత్తం అస్తిత్వమే దోపిడీ మూలంగా విమర్శకి గురైంది.

బ్రిటీష్‌వాడు తెచ్చిన కొలువుల పందారం కోసం ఎగబడ్డంలోంచే యీ ఉద్యమాలు పుట్టాయి. యిప్పటికీ ఆధునిక ఉద్యోగాల కోసం అవకాశాల కోసమే యీ కొట్లాట అంతా. వేద జ్ఞానం కోసం ఎగబడేవాళ్లు యెవరూ లేరు. నిజానికి ఆ జ్ఞానం బ్రాహ్మలకే అక్కరలేకుండా పోయింది.

యింగ్లీషువాడు తెచ్చిన ఆధునికతలోంచి యీ విద్వేష జ్వాలలు పుట్టాయి.

## అక్కరకు వచ్చిన బౌద్ధం

హిందూ – ముస్లిం అస్తిత్వ ఘర్షణ, బ్రాహ్మణ వ్యతిరేకత జ్వలిస్తున్న కాలంలో కేటిగాడిలా వచ్చిందే బౌద్ధం.

అటు యిస్లామూ కాదు యిటు క్రైస్తవమూ కాదు హిందూమతమూ కాదు. అందరూ మరిచిపోయి చరిత్ర పాఠాలకే పరిమితమైపోయిన బౌద్ధం తెరమీదికి రావడంలోని అంతరార్థమేమిటి?

## పలాయనవాదం

అంబేద్కర్ బౌద్ధమత స్వీకరణ వొక విషయమే కాదు. అంతకన్న గాంధీ సుపుత్రుడు యిస్లాంని స్వీకరించాడన్నదే విప్లవాత్మకం, అదొక సామాజిక సంచలనం.

బౌద్ధానికి రంగా? రుచా? అదొక మరుగున పడిపోయిన మతం. కంకాళాన్ని తవ్వి తీసినట్లు బ్రిటీష్‌వాళ్లు తవ్వితీశారు. అంతకన్న అంబేద్కర్ పూర్వమతమైన కబీర్

పంథీలో హిందూ ముస్లిం సమైక్యత గురించి సారం దాగి వుంది. కులవ్యవస్థపై తిరుగుబాటుగా వచ్చిందే కబీర్ పంథీ అని దళితవాదులు అంటారు. మరి అంబేద్కర్ బౌద్ధమత స్వీకరణలో దాగిన సారం యేమిటి? బౌద్ధంలోని నిర్గుణత్వమే దాని సారం. అది సజీవమైన సంప్రదాయం కాదు.

వొక సంప్రదాయంగా, పరంపరగా కొనసాగుతున్న భారతీయ మార్గాలనుంచి, ప్రతీకల నుంచి విడివడిపోవడాన్ని వలసవాదం ప్రోత్సహించింది. అందుకే కబీర్ పంథీ నుంచి విడివడిపోయి దేశంలో యెక్కడా కానరాని గ్రంథస్థ బౌద్ధంలోకి కూరుకుపోయాడు అంబేద్కర్.

లండన్ లైబ్రరీలోని ఆంగ్లేయ అనువాద గ్రంథాలు అన్నిటినీ అపోసన పట్టిన యీ ఆధునిక పండితుడికి సజీవమైన దానిలో కాక గ్రంథంలోనే మోక్షం లభించడం యాదృచ్ఛికం కాదు. గ్రంథమే ప్రధానమని పాశ్చాత్య ప్రొటెస్టెంట్ క్రైస్తవం ప్రచారంలోకి తెచ్చింది.

కబీర్ పంథీ శృతి సంప్రదాయం. అది గ్రంథస్థం కాదు. అదివైదిక బ్రాహ్మణ సంప్రదాయం కాదు. కులవ్యవస్థపైన తీవ్ర విమర్శని ఎక్కుపెట్టిన సంప్రదాయం పైగా వొక నిమ్నజాతి వ్యక్తి ప్రవర్తిల్లజేసిన సంప్రదాయం. జనుల నాలుకలపై నర్తించే మౌఖిక సంస్కృతి.

దాన్ని విడిచిపెట్టి క్షత్రియుడూ వర్ణ ధర్మ ప్రవర్తకుడైన బుద్ధుడు స్థాపించిన సిద్ధాంతంలోకి అంబేద్కర్ ఎందుకు వెళ్లాడు? మరీ వెతుక్కుంటూ ఎందుకు వెళ్లాడు? అలగాజనానికి సంబంధించిన సంస్కృతి నుంచి బౌద్ధ కులీన సంస్కృతిలోకి ఎందుకు పలాయనం చిత్తగించాడు?

బుద్ధుడు లేనిదే మనువులేడు. కుల వ్యవస్థకు అవసరమైన మౌలిక సిద్ధాంతాన్ని తొలి బౌద్ధమే ప్రవర్తిల్లజేసింది. ప్రజలు మాట్లాడే పాళీ భాష ద్వారా ప్రజలలోకి వర్ణ భావజాలాన్ని చొప్పించింది బౌద్ధమే. దానికి ప్రామాణిక సంస్కృత రూపాన్ని యిచ్చింది మనుస్మృతి. అందువల్ల మనుస్మృతిని తగలబెట్టడమంటే పరోక్షంగా బౌద్ధాన్ని అవమానించడమే.

నిజానికి మనువు బుద్ధుడంతటి కఠోర వర్ణవాది కాదు. బుద్ధుడంతటి ఛాందసుడు కాదు మనువు. నిజానికి 'మనువు' బ్రాహ్మణులు కులాంతర వివాహం చేసుకోవడాన్ని అనుమతించాడు. బ్రాహ్మణులు కులాంతర వివాహం చేసుకొని వర్ణభ్రష్టులయ్యారని సాంకర్యానికి గురై స్వచ్ఛతని కోల్పోయారని బుద్ధ భగవానుడు బ్రాహ్మణుల్ని అధిక్షేపించాడు. బ్రాహ్మణులతో పోలిస్తే క్షత్రియులే స్వచ్ఛమైనవారని, వారు కఠోరదీక్షతో వర్ణ సాంకర్యాన్ని అడ్డుకొంటున్నారని బుద్ధుడు వాదించాడు. (దీఘనికాయలోని అంబట్టసుత్తం) బుద్ధుడు త్రైవర్ణికులతో సమావేశమయ్యేవాడే కాని శూద్రులతో కాదు.

నిజానికి బ్రాహ్మణులు కాదు. బుద్ధులాంటి నిష్ఠాపరులైన క్షత్రియులే వర్ణవ్యవస్థ పాతుకుపోవడానికి అవసరమైన సిద్ధాంతాల్ని సమకూర్చారంటాడు. ప్రముఖ చరిత్రకారుడు ఇర్ఫాన్ హబీబ్ (రెలిజియన్ ఇన్ ఇండియన్ హిస్టరీకి ముందు మాట. తూలికా బుక్స్ ఢిల్లీ 2007)

ఉపనిషత్తుల్లో కాని బౌద్ధ గ్రంథాల్లో కాని ప్రముఖ స్థానాన్ని ఆక్రమించిన కర్మ సిద్ధాంతం. కుల వ్యవస్థకి గొప్ప సమర్థనగా పని చేసింది. ఉపనిషత్తులకీ బౌద్ధానికీ మూల ప్రవర్తకులు క్షత్రియులే. దీన్నిబట్టి పూజారి వర్గం మంత్రతంత్రాలతో మార్మిక శక్తులపట్ల విశ్వాసాన్ని ప్రోదిచేసి, హేతువిరుద్ధమైన భావాలతో కులవ్యవస్థనీ వర్ణవ్యవస్థనీ విస్తరింపజేసింది అన్నది కుతర్కం మాత్రమే.

అసలు విషయం క్షత్రియులు వేద కాలానంతరం బలంగా ప్రవర్తిల్లజేసిన కార్యకారణ సిద్ధాంతమే కులవ్యవస్థకి బలాన్ని చేకూర్చింది. విత్తుని బట్టి చెట్టు వుంటుంది. కారణాన్ని బట్టి కార్యం వుంటుంది. కర్మని బట్టి జన్మ వుంటుంది యిదీ ఆతర్కం. యిదే క్షత్రియ తర్కం. యిదే బౌద్ధ తర్కం. అంటే హేతువాదమే కార్యకారణ సంబంధమే కులవ్యవస్థకి బలాన్ని చేకూర్చింది. మనని యీనాటికీ వెంటాడుతున్నది యీ హేతువాదమే కార్యకారణవాద తర్కమే. ఆధునికత పేరులో విజృంభించింది దీని విశ్వరూపమే అందుకే కాబోలు ఆధునికతకి దాసానుదాసుడైన గురజాడ కూడా కర్మ సిద్ధాంతాన్ని సమర్థించాడు.

కర్మ సిద్ధాంతం ఇబ్సన్ వంటి పాశ్చాత్యుల సిద్ధాంతాలకంటె గొప్పదని మెచ్చుకొంటాడు గురజాడ. "జీవితంలో హెచ్చుతగ్గులు ఎందుకు కలుగుతున్నవో

కర్మ సిద్ధాంతం సమాధానపరిచినంతగా మరి యేదీ, అది ప్రాచీనమైనదైనా, ఆధునికమైనదైనా జవాబు చెప్పడంలేదు. అన్ని విశ్వాసాలకంటె సూత్రాలకంటె కర్మసిద్ధాంతం జీవిత వ్యత్యాసాల హేతువులకు బలమైన సమర్థింపు" అంటాడు గురజాడ. ఆధునికమైన హెరిడిటీ, పరిసరాలు మొదలైన సిద్ధాంతాలకంటె కర్మ సిద్ధాంతమే గొప్పది అంటాడు గురజాడ (గురజాడ రచనలు – వ్యాసాల సంకలనం. హరిశ్చంద్ర నాటక పీఠిక).

పైన గురజాడ వ్యక్తం చేసిన భావాలకి బలమైన సమర్థన బుద్ధుని బోధనల్లో కనబడ్తుంది. పాపకార్యాలు ఆచరించిన మూర్ఖుడు నీచమైన జంతుజన్మ పొందుతాడు. చివరికి మనిషిగా జన్మించడం జరిగితే, నీచకులంలో పుడతాడు చండాల కులంతో. లేదా మేదర, రథకార పుక్కస (పాకీ)కులంలో పుడతాడు. మంచివాడు మాత్రం బ్రాహ్మణుల లేదా గహపతుల కుటుంబంలో జన్మిస్తాడు. (బాల పండిత సూత్రం – మజ్జిమనికాయ)

శ్రామిక కులాలూ నీచవృత్తులని ఆచరించే కులాలూ అధమమైనవిగా భావించబడ్డాయి యిక్కడ. యీ పరిణామం కొత్తది. వేదకాలంలో యిది లేదు రుగ్వేదంలో యిటువంటి భావాలు కనబడవు. రుగ్వేద ఆర్యులు వేటమీద ఆహార సేకరణమీద జీవించిన వాళ్లు. పశుపోషణ వాళ్ల ప్రధాన వృత్తి. వ్యవసాయం కాదు.

వ్యావసాయిక సమాజంతో పాటే కులవ్యవస్థ ఆవిర్భవించింది, విస్తరించింది. విత్తుని బట్టి చెట్టు, కర్మని బట్టి జన్మ అనేవి వ్యావసాయిక సమాజం నుంచి ఆవిర్భవించిన భావాలు. వ్యావసాయిక సమాజానికి సంబంధించిన మేధావి బుద్ధుడు. అందుకే పశుహింసని నీచంగా పరిగణించాడు. దీని ద్వారా వేట, ఆహార సేకరణల ద్వారా జీవించే వాళ్లని అధర్మపరులుగా అంటరానివాళ్లుగా చిత్రించేందుకు అవసరమైన భావజాలాన్ని ఆవిష్కరించాడు. బౌద్ధ అహింసవాదం గిరిజనులకీ ఆహారసేకరణ మీద ఆధారపడిన వాళ్ళకీ ముప్పుగా పరిణమించింది.

బహుశా వ్యవసాయిక సమాజం యొక్క భావజాలంలో యిమడలేకపోయిన నిషాదుల వంటివాళ్లే అస్పృశ్యులుగా మార్చబడి వుంటారు. యిది ఆర్. ఎస్. శర్మ

వంటి చరిత్రకారుల అభిప్రాయం కూడా.

అసలు అస్పృశ్యత మొదలు రైతులు అమలులో పెట్టి వుంటారంటాడు ఇర్ఫాన్ హబీబ్, హాలికులు (వ్యవసాయదారులు) ఆహార సేకరణ దశలో మిగిలిపోయిన వాళ్లని అస్పృశ్యులుగా వ్యవహరించి వుంటారు.

ఏదేమైనప్పటికీ బౌద్ధ అహింస సిద్ధాంతం కులవివక్షకి మూలమైంది. వేట, చేపలు పట్టడం వంటి వృత్తులు నిషేధార్హమైనవిగా భావించబడ్డాయి. బౌద్ధ ప్రభువులు నిషేధించారు కూడా.

బౌద్ధ ప్రభువు అశోకుడు కొన్నిరోజులపాటు చేపలు పట్టడాన్ని నిషేధించిన శాసనాలు దొరుకుతున్నాయి. శ్రీలంకలో 12వ శతాబ్దంలో నిస్సానక మల్ల అనేరాజు అనురాధపురం అనే పట్టణం చుట్టుపక్కల వేటనీ, చేపలు పట్టడాన్ని తీవ్రంగా నిషేధించిన శాసనం వొకటి లభిస్తోంది. (Heaven and Earth and I అనే గ్రంథంలో The Rediscovery of Ahimsa - Jayantha Jayewardene) అశోకుని కుమారుడైన అర్హత మహేంద్ర శ్రీలంక రాజుకి చేసిన విజ్ఞప్తిలో జంతువులు పక్షుల్ని రక్షించాలని కోరాడు. వేటని నిషేధించాలని కోరాడు. అదీ యీ వ్యాసంలోనే వుంది.

ఈ అహింసావాదం వేటమీద, ఆహార సేకరణమీద ఉక్కుపాదం మోపడానికి కారణమైంది. గిరిజనులపట్ల బౌద్ధ చక్రవర్తి అశోకుడు కఠోర వైఖరిని అవలంబించాడు. తాను చెప్పే ధర్మాన్ని అనుసరించాలని, లేకపోతే కష్టాలు యెదుర్కోవలసి వస్తుందని హెచ్చరించాడు. (India's Ancient Past - R.S. Sharma) అందువల్ల వేట, ఆహార సేకరణ అధమమైనవిగా అధర్మంగా భావించబడ్డాయి. అట్టి జీవన విధానం నుంచే తప్పించుకోలేనివారు అస్పృశ్యులుగా యీసడించుకోబడ్డారు. యిలా యీసడించుకొన్నవారు వ్యవసాయదారులే. వ్యవసాయం నాగరికతగా ధర్మంగా మారడంతో యీ వివక్ష మొదలైంది. వెలివాడలు ఏర్పడ్డాయి.

వ్యవసాయంవల్ల క్రిమి కీటకాలు చనిపోయే అవకాశం వుంది. కనుక వ్యవసాయదారులు కూడా శూద్రులుగా నిమ్నకులాలుగా యీసడించుకోబడ్డారు.

యీ బౌద్ధ భావనలే శాకాహార వాదానికి మూలమయ్యాయి. బౌద్ధ అహింసావాదం వంటి సిద్ధాంతాలు విజ్ఞానశాస్త్ర ప్రగతికి కూడా ఆటంకంగా నిలిచాయి. వొకమేరకు బౌద్ధం సైన్సు విస్తరణకి కూడా ఆటంకంగా మారింది.

కారణం ఏమిటంటే - జంతుహింస పాపం, మాంసాహారం నిషిద్ధంగా భావించబడడంతో గోవధ క్రమేపీ పూర్తిగా నిషేధించబడింది. గోవు వ్యవసాయంలో చాలా ప్రధానపాత్ర వహించడం కూడా యిందుకు కారణం. బ్రాహ్మణులు శాకాహారులుగా మారారు.

శాకాహారానికి వచ్చిన ప్రాముఖ్యంవల్ల వైద్యంలో కూడా మాంసాహారాన్ని వినియోగించరాదనే వాదన మొదలైంది. బౌద్ధ జైనాల ప్రభావమే దీనికి కారణం. ఆ మతాల అహింసాధర్మమే దీనికి కారణం. యిది అహింసావాదం సృష్టించిన హింస రచన; విజ్ఞాన ధ్వంస రచన.

## వైద్య శాస్త్రాన్ని దెబ్బతీసిన బౌద్ధజైనాలు

వసంతకాలంలో ఆహారంలో స్వీకరించవలసిన వివిధ మాంసాల ప్రసక్తి చరక సంహితలో కనబడ్తుంది. వైద్యంకోసం మాంసాన్ని ఉపయోగించడాన్ని ప్రాచీన ఆయుర్వేదం సమర్థించింది.

కాని బౌద్ధజైనాలు వైద్యం కోసం కూడా మాంసాన్ని ఉపయోగించరాదని నిషేధాన్ని తీసుకువచ్చాయి. 9వ శతాబ్దంలో జైన మేధావి ఉగ్రాదిత్యుడు వైద్యంలో మాంసాన్ని ఉపయోగించరాదని వాదించాడు. శాకాహారాన్నే ఉపయోగిస్తూ వైద్యం చేయాలని ప్రతిపాదించాడు. జైన పండితుడైన ఉగ్రాదిత్యుడు నృపతుంగ వల్లభ మహారాజు సంస్థానంలో శాకాహార విశిష్ఠతను చాటుతూ ఉపన్యసించాడు కూడా.

బౌద్ధ జైనాల శాకాహార ఛాందసత్వాన్ని బ్రాహ్మణులే సమర్థంగా యెదుర్కోవడం విశేషం. వైద్య కుటుంబానికి చెందిన బెంగాలీ బ్రాహ్మణుడైన చక్రపాణిదత్త వైద్యంలో మాంసాహారం ఉపయోగించడాన్ని గట్టిగా సమర్థించాడు. బౌద్ధ జైనాల శాఖాహార వాదాన్ని ఖండించాడు. యీయన 11వ శతాబ్దానికి చెందిన నయపాల మహారాజు సంస్థానంలోనివాడు. మైత్రి కరుణ భావాలకి మాంసాహారాన్ని స్వీకరించడం విరుద్ధమనే

బౌద్ధవాదాన్ని ఖండించాడు. ధర్మాన్ని ఆచరించాలంటే చిరకాలం జీవించాలి అనేది వైదికధర్మం. చిరంజీవి కావాలంటే చరకాది వైద్య పితామహులు చెప్పిన మాంసాహార స్వీకరణని కూడా ఆచరించక తప్పదన్నాడు వైద్య బ్రాహ్మణుడు చక్రపాణిదత్త, నిజానికి చక్రపాణిదత్తకి ఆశ్రయమిచ్చిన బెంగాల్ రాజు బౌద్ధుడు. ఆరాజు దగ్గర బౌద్ధ అహింసావాదాన్ని యెదుర్కొని మాంసాహారానికి మద్దతు పలికినవాడు బ్రాహ్మణుడు కావడం యాదృచ్ఛికంకాదు. వైదిక యజ్ఞ క్రతువులో మాంసాన్ని హెూమం చేయడం నేటికీ ధర్మంగానే భావించబడ్తోంది. యిట్టి బ్రాహ్మణ ఆచారవ్యవహారాలు బౌద్ధ అహింసావాద మౌఢ్యాన్ని యెదుర్కొని వైద్య విజ్ఞానాన్ని ప్రగతి పథంలో కొనసాగించడానికి చాలా ఉపయోగించాయి. (Dharm - Edited by Patrick Olivelle, Motilal Banarsidass Publishers, వ్యాసం పేరు Medicine and Dharma)

నిజానికి బ్రాహ్మణులు బౌద్ధజైన ప్రభావాలకి లోనై కొన్ని ప్రాంతాలలో శాకాహారులుగా మారారు. కాని అన్నిచోట్ల కాదు. బెంగాల్లో, ఒరిస్సాలో బ్రాహ్మణులు చేపలని ఆహారంగా స్వీకరిస్తారు. పైగా బ్రాహ్మణులు శాకాహారులుగా మారినా యజ్ఞాదిక్రతువుల్లో జంతుబలిని విడిచిపెట్టలేదు. బ్రాహ్మణులు ఎప్పుడూ మధ్యేమార్గంలోనే ప్రయాణిస్తారు. బుద్ధుడిది మధ్యేమార్గం అంటారు కాని నిజం కాదు. బహుశా మధ్యేమార్గం అనే పదానికి నిజమైన అర్థాన్ని బ్రాహ్మణులే గ్రహించారనిపిస్తుంది. (దాన్ని బౌద్ధం నుంచి స్వీకరిస్తే స్వీకరించి వుండవచ్చు)

యిందుకు మనువే మంచి ఉదాహరణ. మనువు కూడా మాంసాహారం పట్ల వ్యతిరేకతని కనబరచినప్పటికీ, మరోచోట యజ్ఞ క్రతువులలో ధర్మమేనన్నాడు. బౌద్ధం సృష్టించిన వ్యాకులతని మనువు యెదుర్కొన్నట్లే కనబడ్తుంది. కాని చివరికి వైదిక కాలానికి తిరోగమించి, మాంస, మద్య మైథునాలని వొకేగాట కట్టి కీర్తించాడు.

**న మాంస భక్షణే దోషః**
**న మద్యే నచ మైథునే**
**ప్రవృత్తిరేషా భూతానాం**
**నివృత్తిస్తు మహాఫలా.** (మనుస్మృతి) 5-55

మాంసభక్షణం చేయడం తప్పు కాదు. మద్యాన్ని స్వీకరించడం, మైథునాన్ని ఆచరించడం దోషములు కావు. వీటియందు జీవజాలం సహజంగానే ప్రవర్తిస్తోంది. వీటిని విడనాడి నివృత్తి మార్గంలో వెళ్ళడం మాత్రం గొప్ప ఫలితాన్ని – మోక్షాన్ని యిస్తుంది.

మనువు యీ శ్లోకం ద్వారా బుద్ధుడు తీవ్రంగా నిషేధించిన వైదిక ప్రవృత్తి మార్గాన్ని సహజమార్గాన్ని గుర్తు తెస్తున్నాడు. వేదంలోని సోమ పానాన్ని, మైథునశీలతని, మాంస ప్రియత్వాన్ని మరోసారి స్మృతి పథంలోకి తీసుకువచ్చి బౌద్ధ నిస్పృహని తీవ్రరూపంలో యెదుర్కొంటున్నాడు అసలు యీ సహజ ప్రవృత్తులు దోషాలూ పాపాలూ కావంటున్నాడు.

బౌద్ధం మద్యమాంస, మైథునాలపై తీవ్ర వ్యతిరేకతని చాటింది. బుద్ధుని బోధనల నిండా యిదే కనబడ్తుంది. యీ వాదాన్ని సనాతన బ్రాహ్మణులు గుడ్డిగా అంగీకరించలేదు.

ప్రతిఘటించారని కూడా మనుస్మృతివల్ల తెలుస్తోంది.

బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానంతో పోలిస్తే మిగిలిన కళలూ, విద్యలూ, యింద్రియ అనుభవాలూ కిందిస్థాయివి అని భావించారు కాని వాటిని నిషేధించదగినవిగా భావించలేదు. బుద్ధునిది పూర్తిగా నకారాత్మక దృష్టి; నిషేధ దృష్టి.

క్రైస్తవం పైన బౌద్ధం ప్రభావం వుందని కొందరు పండితులు చెప్తుంటారు. శృంగారాన్ని నిషిద్ధ ఫలంగా పాపంగా భావించడానికి బుద్ధుని బోధనలే కారణమయి వుండవచ్చు. యీ నిషేధ దృష్టే వైద్య శాస్త్రానికి గండికొట్టింది.

కులవ్యవస్థ, కుల పట్టింపులు, అంటు దోషం లాంటి బ్రాహ్మణ విశ్వాసాలు వైద్యశాస్త్రానికి అవరోధంగా నిలిచాయని కొందరు మేధావులు వాదిస్తారు. కాని మధ్యేమార్గవాదులైన బ్రాహ్మణులు అంటు దోషాన్ని కూడా తెలివిగా అతిక్రమించారు.

**చికిత్సకో యత్కురుతే, తదన్యేన నశక్యతే**
**తస్మచ్చికిత్సకః స్పర్శే, శుద్ధో భవతి నిత్యశః.**

(యాజ్ఞవల్క్య స్మృతి)

ఇతరులెవరూ చేయజాలని దానిని వైద్యుడు చేస్తాడు. అందుచేత వైద్యుడు స్పర్శ విషయంలో నిత్యశుద్ధుడు అంటాడు యాజ్ఞవల్క్యుడు.

రోగాలతో బాధపడే వాళ్ల శవాలని, అశుచి కలిగిన వాళ్లని స్పృశించడం చేయకూడనిదిగా అన్ని దేశాలలోనూ భావించబడి వుంటుంది. కాని వైద్యునికి అంటులేదని చెప్పడం ద్వారా స్మృతికారులు విజ్ఞాన ప్రగతికి ఆటంకాలని తొలగించగలిగారు.

బౌద్ధంలో వైద్యం వొక శాస్త్రంగా అభివృద్ధి చెందలేదు. బ్రాహ్మణులే సంస్కృత మాధ్యమంగా వైద్య శాస్త్రాన్ని అభివృద్ధి పరిచారు అనే సత్యాన్ని మనం విస్మరించకూడదు. ఆయుర్వేదం అనే పేరే వేదాన్ని గుర్తుకు తెస్తోంది. ధర్మాన్ని ఆచరించడం కోసం వందేళ్లు జీవించాలనేది వేద బోధే.

సత్ – ఉనికిని నిరాకరించడం, శూన్యవాదం, సర్వం దుఃఖం బౌద్ధుల దృష్టిని బలహీన పరిచాయి. దృష్టి దోషానికి కారణమయ్యాయి. అందుకే వాళ్ల ఖగోళ దృష్టి కూడా లోపభూయిష్ఠమైనది. ఖస్థం నదృష్టం గురు చ క్షమాతః, ఖే అధః ప్రయాతీతి వదంతి బౌద్ధాః (గోళాధ్యాయం – భాస్కరాచార్య) బరువైన పదార్థమేదైనా నిరాధారమైన శూన్యంలో నిశ్చలంగా నిలవదు. అది కిందికి పడిపోతుంది. అందువల్లనే భూమి కూడా అధః పతనం చెందుతోందని బౌద్ధుల తర్కం.

యీ తర్కానికి భిన్నంగా భూమ్యాకర్షణ శక్తి అనే సిద్ధాంతాన్ని వైదిక సనాతనులు ప్రతిపాదించారు. అధఃపతనం, దుఃఖం అనే సిద్ధాంతాన్ని ఖగోళపరంగా కూడా యెదుర్కొన్నారు. సనాతనం ఆకర్షణమీద, బౌద్ధం వికర్షణ మీద ఆధారపడ్డాయి.

అందువల్ల బౌద్ధ నకారాత్మక దృష్టి శాస్త్ర విజ్ఞానానికి ఆటంకంగా నిలిచింది. వైదిక సనాతన ధర్మం శాస్త్ర పురోగతికి తోడ్పడింది అనే సత్యాన్ని గుర్తించాలి. దీనికి విరుద్ధమైన వాదాలు మిథ్యా వాదాలు.

ఏనాడు బౌద్ధమతం భారతదేశంలో తుడిచిపెట్టబడిందో, ఆనాడే భారతదేశం మత విషయక ఆత్మహత్య చేసుకొంది అన్నాడు గురజాడ.

మతములన్నియు మాసిపోవును అని శాపనార్థాలు పెట్టిన గురజాడకి మతం వూసెందుకో తెలియదు కాని బౌద్ధమతం తుడిచిపెట్టుకుపోలేదు. దానిలోని గొప్పతర్కాన్నీ, సారాన్నీ స్వీకరించి పిప్పిని వదిలేశారు వైదికులు. దానిలోని పిప్పినే పట్టుకొని వేళ్లాడ్తున్నారు నేటి మేధావులు. అహింసా వాదం అటువంటిదే.

బౌద్ధం ముందుకు తెచ్చిన అహింసా వాదానికి గల పరిమితులని బయటపెట్టారు మీమాంసకులు.

**నహింసాద్యనుష్ఠానే, తదానీం దోషదర్శనం.** (కుమారిలుడు)

హింసని ఆచరించిన సమయంలో, అప్పటికప్పుడు మనకు తప్పు చేస్తున్నామన్న భావన కలగడం లేదు అంటాడు కుమారిలుడు. అంటే హింసని తప్పనికాని ఒప్పు అని కాని వేల్యూ జడ్జిమెంటు చేస్తున్నది మనుషులే. అది సంప్రదాయం ద్వారా జరుగుతుందని మీమాంసకులు అంటారు నిజమే. కాని అసలు విషయం విలువ అనేది ఆపాదితం అనే సంగతి. అది వ్యాఖ్యాన సాపేక్షం.

యిది సనాతనుల్ని మరోవైపు కూడా దృష్టిని సారించేలా చేసింది. అహింస వైపే కాక హింసవైపు కూడా దృష్టిని సారించేలా చేసింది. జీవితంలో హింసని పూర్తిగా పరిహరించడం అసాధ్యమనే సత్యాన్ని తెలుసుకొనేలా చేసింది.

## బౌద్ధానికి విరుగుడు భగవద్గీత

బహుశా బౌద్ధ అహింసావాదానికి విరుగుడుగానే భగవద్గీత ఆవిర్భవించింది. తస్మాదపరిహార్యేర్థే, నత్వం శోచితుమర్హసి – పరిహరించలేనిదాని విషయంలో అది హింసయైనా సరే మల్లగుల్లాలు పడడం అనవసరం అని గీత బోధించింది.

వలసవాదంపై తిరుగుబాటుకు భగవద్గీత ప్రేరణగా నిలిచింది. భగవద్గీత మాత్రమే అలా నిలవగలిగింది కాని బౌద్ధం మాత్రం కాదు. వలసవాదాన్ని వ్యతిరేకించలేని సంస్కర్తలే బౌద్ధాన్ని మెచ్చుకోవడం యాదృచ్ఛికం కాకపోవచ్చు.

యుద్ధం, పోరాటం జీవిత సత్యాలనే భావం భగవద్గీతలో అంతర్లీనంగా వుంది. వొకవేళ అహింసని వొక విలువగా స్వీకరించినా అది వొక పోరాటరూపంగా మారిపోతుందని గాంధీమహాత్ముడు నిరూపించాడు.

భగవద్గీత వైరుధ్యాల పుట్ట అని విరుద్ధ భావాల కూడలి అని ఆధునికులు విమర్శిస్తారు. వైవిధ్యాలూ వైరుధ్యాలూ జీవన సహజ సూత్రాలు. హింస – అహింస బొమ్మా బొరుసూ ద్వంద్వాల్లో వేటినీ విడదీయలేం అని భగవద్గీత నిరూపించిన వ్యావహారిక సత్యం.

వలసవాదాన్నీ బ్రిటీష్ ప్రభువుల్నీ కీర్తించి, వారితోగల వైరుధ్యాన్ని చూడ నిరాకరించిన గురజాడ కూడా భగవద్గీతని ఉత్తమగ్రంథంగా చూసినట్లే కనబడ్తుంది. కన్యాశుల్కం చివరలో భగవద్గీతని వేశ్యయైన మధురవాణికి సౌజన్యారావుచేత బహూకరింపజేస్తాడు గురజాడ. ఉత్తమమైన ప్రేమకి బౌద్ధమార్గమే శరణ్యమని భావించిన గురజాడ బౌద్ధగ్రంథాన్నో బుద్ధుని విగ్రహాన్నో కాక శ్రీకృష్ణుడు బోధించిన భగవద్గీతని బహూకరింపజేస్తాడు. భారతీయులు బౌద్ధాన్ని దేశం నుంచి తరిమేసి ఆత్మహత్య చేసుకొన్నారని తీవ్ర ఆరోపణ చేసిన గురజాడకి, యిక్కడ భగవద్గీతే అగత్యమైంది కారణమేమిటి?

గురజాడ భారతీయ సంస్కృతికి సంబంధించిన ప్రతీకల్నీ, గ్రంథాల్నీ గౌరవంతో శ్రద్ధగా అధ్యయనం చేసే వ్యక్తి కాదు. అతని దృష్టి వలసవాద దృష్టి. ఆంగ్లభాష, ఆంగ్లేయదృష్టి ఉత్తమమైనవని వారి అడుగు జాడల్లో నడవడమే భారతీయులకి శరణ్యమని భావించాడు. భారతీయుల దురాచారాల్నీ మౌఢ్యాన్నీ నిరసించడమే ప్రధానం వారిలో మంచిని చూడడం అతని పనికాదు. పైగా అది అపచారంగా కూడా భావించాడు.

రాజుగారి కొలువులో తిష్ఠ వేయడం, రాజుగారికి వేశ్యలతో గల సంబంధాల్ని సజావుగా కొనసాగేలా చూడడం, కోర్టు వ్యవహారాలూ, ఆంగ్లేయ స్నేహాలూ, ఆంగ్లవ్యామోహమూ యివన్నీ గురజాడలో పుష్కలంగా కనిపిస్తాయి. గురజాడ తనని తానే అద్దంలో చూసుకొని గిరీశం అని పిలుచుకొన్నాడు.

విజయనగరానికే సంబంధించిన హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు రాజుల కొలువుకూటాల్లో ఊడిగం చేయడాన్ని నిరసించాడు. వలసవాదులు వారి విధానాలూ మన సంస్కృతిపై జరుపుతున్న దాడిని వ్యతిరేకించాడు 'నా ఎఱుక' పుస్తకంలో (ఆయన కూడా ఇంగ్లాండురాణిపై పద్యాలు రాయడం వొక వైరుధ్యం)

కాని గురజాడ జార్జి ప్రభువుకీర్తనలో వలసవాద భజనలో తరించాడు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వీరేశలింగంగారి వంటి సంస్కర్తలలోని వలసవాద భావజాలాన్ని తిరస్కరించారు. అగ్రహార సంస్కృతిలోని జీవలక్షణాన్ని కూడా వర్ణించాడు సుబ్రహ్మణ్య శాస్త్రి అనుభవాలూ, జ్ఞాపకాలలో. బ్రాహ్మణుల ఆచార వ్యవహారాలూ, యజ్ఞాలు, వారి ప్రతిభాసంపత్తులను కూడా కొనియాడాడు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి కూడా సమకాలీన బ్రాహ్మణ సమాజంలోని లోపాల్నీ సంకుచితత్వాన్నీ యెత్తి చూపినవాడే కాని, నిందించడమే పనిగా పెట్టుకోలేదు. సంస్కృతిపైనే దాడి చేయలేదు.

గురజాడ మంచి గతమున కొంచెమేనోయ్ అంటూ భారతీయ సమాజాన్ని మొత్తంగా నిరాకరించి సరుకులపై ఆధారపడిన పెట్టుబడిదారీ వ్యవస్థని కీర్తించాడు. సంస్కృతితో, సంఘంతో, కమ్యూనిటీతో, కుటుంబంతో పూర్తిగా బంధనాలు తెంచుకొని కొలువుల్లో జేరి సొంతలాభమే ప్రధానంగా గల అటామిస్టిక్ ఇండివిద్యువల్‌కి దారి యేర్పరిచాడు.

హెగెల్ భగవద్గీత జర్మన్ అనువాదానికి ముందుమాట రాస్తూ భగవద్గీతలో అటామిస్టిక్ ఇండివిద్యువల్ అనే భావనకి ఆస్కారం లేదని, అదొక లోపమని కూడా విమర్శించాడు. కులమూ కమ్యూనిటీయే ప్రధానమైందని వాపోయాడు.

కాని యిప్పుడు విచిత్రంగా భగవద్గీతని పర్సనాలిటీ డెవలప్‌మెంట్‌కి అనుగుణమైన గ్రంథంగా వ్యాఖ్యానిస్తూ, ఆధునిక మార్కెట్ నైపుణ్యాల్ని వెతుకుతున్నారు ఆధునిక గురువులు. దీనికి దారి యేర్పరిచినవాడు గురజాడ.

భారతీయ సంస్కృతినీ గతాన్నీ పూర్తిగా నిరాకరించి, ఆంగ్లేయుల పద్ధతులే శరణ్యమని భావించిన గురజాడ భగవద్గీతని మెచ్చుకోవడం ద్వారా భగవద్గీతని కూడా వలస సామ్రాజ్యవాద అనుకూలంగా వ్యాఖ్యానించవలసిన అగత్యాన్ని ఏర్పరచాడు. యీనాడు జరుగుతున్నదదే.

## వ్యక్తీ – సమాజం

భారతీయుల దృష్టిలో విశ్వమంతా వొక విరాడ్రూపం, భగవంతుని రూపం. జీవుడు విశ్వానికి అంటే భగవంతుని బృహత్ రూపానికి సూక్ష్మరూపం. అతడు

విశ్వం మొత్తంతో సంబంధం గలిగిన పరిపూర్ణుడు. అణోరణీయాన్ మహతో మహీయాన్ తాత్పర్యం యిదే. అణువూ బ్రహ్మాండమూ వొకటే. అందుకే ఏకాంతం కూడా ఏకాంతం కాదు, అది విశ్వంతో అనుబంధం. అందువల్ల వ్యక్తి విశ్వరూపుడు. యిది తాత్వికం.

యింక వ్యవహారానికి వస్తే తన కులంతో కుటుంబంతో అతనిది విడదీయరాని బంధం.

యిటువంటి బంధాన్ని ఆధునికత త్రుంచివేసింది. వ్యక్తి వికాసం అనే భావాన్ని తెచ్చింది. వ్యక్తిని మొత్తంతో విడదీసి అదే స్వేచ్ఛ అంది. అటామిస్టిక్ ఇండివిడ్యువల్ అనే భావాన్ని తెచ్చింది.

సంపద అంటే చాలా విస్తృతమైన అర్థం వుంది. సనాతనంలో, వ్యక్తి లాభమే ప్రధానమైన యీ ఆధునిక వ్యవస్థలో డబ్బూ, సరుకులే ప్రధానం. సంపద అంటే డబ్బు. సంపద అంటే సరుకులు, వీటినే దేశభక్తి గీతంలో కీర్తించాడు గురజాడ.

**"డబ్బులేనట్టి నరులకు**
**కీర్తి సంపదలబ్బవోయ్"**
**"అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్**
**దేశి సరుకుల నమ్మవలెనోయ్"**
**"ధనం పంటలు పండవలెనోయ్"**

– గురజాడ

గిరీశం అంటే గురజాడే – భువనగిరి చంద్రశేఖర్.

## విదూషకుని ఆత్మహత్య

తర్క, వ్యాకరణ శాస్త్రములలో ఏది ప్రామాణికమైన శాస్త్రం అనే విచికిత్సతో ప్రారంభమౌతుంది గురజాడ బిల్హణీయం నాటకం.

**అజ్ఞానాంధస్య లోకస్య**
**జ్ఞానాంజన శలాకయా**
**చక్షురున్మీలితం యేన**

**తస్మై పాణినయే నామః**

అజ్ఞానాంధకారంలో మునిగిపోయిన ప్రపంచాన్ని జ్ఞానంతో కళ్లు తెరిపించిన మహావైయాకరణుడు పాణినికి నమస్కారం అని దీని అర్థం. జ్ఞానమంటే ఏమిటి? శబ్ద జ్ఞానం. శబ్దమే లేకపోతే లోకమే అంధకారమైపోయేదని దండి కూడా స్పష్టం చేశాడు.

ఐతే శబ్దం ముఖ్యమా? అర్థం ముఖ్యమా? అనేది యిక్కడ ప్రశ్న.

రాజసమ్ముఖంలో తర్కవ్యాకరణ పండితుల మధ్య చెలరేగిన శబ్ద అర్థ చర్చకి విదూషకుడు సమాధానం చెప్పడం యిక్కడి విశేషం.

విదూషకుడు యిలా అంటాడు.

వారి వ్యాకరణ శాస్త్రము శబ్ద బ్రహ్మపరము. మీతర్క శాస్త్రము అర్థ బ్రహ్మపరము. అర్థబ్రహ్మన్నే అందరూ ఉపాసిస్తారు. శబ్ద బ్రహ్మంతో సంతుష్టి తక్కువ. యిదీ విదూషకుని సమాధానం.

విదూషకుడు యిక్కడితో ఊరుకోడు. అర్థం అనే పదానికి గల నానార్థాలలోకి వెళ్తాడు. అర్థం అంటే పదం యొక్క అర్థం (మీనింగ్) అంతేకాదు అర్థం అంటే డబ్బు అని కూడా. యస్యాస్తి విత్తం సనరః కులీనః సపండితః డబ్బు వున్నమనిషే కులంగలవాడు పండితుడు కూడా అనే శ్లోకాన్ని జ్ఞప్తికి తెచ్చి అర్థ బ్రహ్మవాదానికి ముక్తాయింపునిస్తాడు విదూషకుడు.

వేమన అనలేదా?

**కులముగలుగువాడు గోత్రముకలవాడు**
**విద్యచేత విర్రవీగువాడు**
**పసిడి కలుగు వాని బానిసకొడుకులు** (వేమన)

వేమన పద్యంలో నిందవుంది. అర్థమే (డబ్బే) పరమార్థంగా మారడాన్ని బానిసత్వంగా భావించాడు వేమన. గురజాడ వారి విదూషకుడు ఉదహరించిన సంస్కృత శ్లోకం కూడా డబ్బుకి లోకం దాసోహం అనడంలోని అల్పత్వాన్నే సూచిస్తుంది.

కాని గురజాడ తన దేశభక్తి గేయంలో అర్థాన్ని అంటే డబ్బుని పరమార్థంగా భావించడం కనిపిస్తుంది. అది దాస్యం కాదు ధన సంపాదనే జీవితధ్యేయం గమ్యం.

**“డబ్బులేనట్టి నరులకు**
**కీర్తి సంపదలబ్బవోయ్”**

**“ధనం పంటలు పండవలెనోయ్”** అని డబ్బే కీర్తికి మూలం అని చాటడం ద్వారా గురజాడ ధనస్వామ్యం పై ఆధారపడిన ఆధునికతలోకి మార్గం ఏర్పరుస్తాడు. సరుకుల గురించి, డబ్బు గురించి కీర్తించి, మందగించకముందుకు అడుగు వెయ్యమంటాడు. ఎక్కడికి? ధనం పై ఆధారపడిన పెట్టుబడిదారీ ఆధునికతలోకి, పాశ్చాత్య ఆధునికతలోకి, యీ ధనస్వామ్యం పట్ల మక్కువ వల్లనే యింగ్లాండులో షేర్ మార్కెట్ పతనం గురించి దిగులు చెందుతాడు (గురజాడ డైరీ, గురుజాడలు – మనసు ఫౌండేషన్)

బిల్హణీయంలో గురజాడ శబ్ద అర్థాలకి సంబంధించిన పండిత చర్చలోకి అర్థశాస్త్రాన్ని (ఎకనామిక్స్) మిక్స్ చేసి సర్వం ధనమయం అనే భావాన్ని తీసుకువస్తాడు. విద్య సంప్రదాయం నుంచి విడివడి మార్కెట్‌తో అనుబంధించబడవలసిన అవసరాన్ని చాలాముందు చూపుతో గుర్తించాడు గురజాడ. అందుకోసం విద్యని ప్రాగ్మాటిక్ పద్ధతిలోకి మార్చాలి. విద్యలో ఊహకీ, కల్పనకీ, సౌందర్యానికీ గల ప్రాధాన్యాన్ని తగ్గించి వెయ్యాలి. వస్తుతత్వంలోకి సరుకుల తత్వంలోకి విద్యను యీడ్చుకు వెళ్లి అర్థశాస్త్రానికి అనుబంధంగా మార్చెయ్యాలి. ధన సంపాదనికి తోవగా మార్చెయ్యాలి. యిందుకోసం ముందు చేయవలసిన పని సంప్రదాయంతో సంస్కృతితో పరంపరతో తెగ తెంపులు. గురజాడలోని విదూషకుడు యేర్పరిచిన రహదారి యిది.

మంచి గతమున కొంచెమేనోయ్ అని కూనిరాగాలు తీస్తూ, అసలు గతంలో మంచి అనేదే లేదన్న నిర్ధారణలోకి తీసుకుపోవాలి యిందుకు ఆంగ్లేయ అనుకరణే శరణ్యం.

అసలు నాటకాల్లో విదూషకుని పాత్ర ప్రధానమైనది ఎప్పుడూకాదు. విదూషకత్వమే నాటకం కాలేదు. ఎందుకంటే విదూషకత్వమే జీవితం కాదు. అది ఉపాంగం మాత్రమే. ప్రధాన నాయకుడిని అలరించే విదూషకుడు తానే ప్రధానమైపోయి కావ్యాన్నంతటినీ

ఆక్రమించెయ్యడం గురజాడలోని విపరీత పరిణామం. యీ విదూషకత్వం హాస్యమై అపహాస్యమై అధిక్షేపమై సుపరిచితమైనదాన్నీ స్వధర్మాన్నీ సంప్రదాయాన్నీ సంస్కృతినీ విద్యనీ, జ్ఞానాన్నీ, శబ్దజాలాన్నీ అన్నిటినీ అధః పాతాళంలోకి తొక్కేసింది. యిదీ విదూషకత్వం యొక్క త్రివిక్రమ అవతారం.

యీ విదూషకత్వంలో దైవ అంశ ఏమాత్రం లేదు. గురజాడవారి విదూషకత్వం పాశ్చాత్య క్రైస్తవ నాగరికత అనే బ్లాక్ హెూల్ నుంచి వెలువడిన రేడియేషన్ మాత్రమే.

అందుకే కాళిదాస కావ్యాలు, పురాణ కల్పనలు అన్నీ అధిక్షేపానికి గురౌతాయి. ఇంగ్లీషు చదువులే శరణ్యమన్న బోధ కూడా పరోక్షంగా గురజాడ నాటకాల్లో కనబడ్తుంది. ఇంగ్లీషు చదువులకి దూరంగా వుండడానికి చేసే ప్రయత్నాలు కూడా హిపోక్రసీగా మారిపోయాయని, నిజాయితీ శూన్యమని గురజాడ తన నాటకాలలో అపహాస్యం చేస్తాడు.

దొంగగా తార్పుడుగాడిగా, పరిశుభ్రతని నటించే అపరిశుభ్రుడుగా, సకల అవలక్షణాలకు, దుర్గుణాలకు నిలయంగా వైదిక బ్రాహ్మణుడిని వర్ణించి అక్కసు వెళ్ళగక్కుతాడు కొండు బట్టీయంలో. ఇది వైదిక సంస్కృతిపై అసహ్యం కలిగించటానికి గురజాడ పన్నిన నీచమైన కుట్ర. (కొండుబట్టీయం, విశాలాంధ్ర)

యీ అపహాస్యం అధిక్షేపం ఒక్కొక్కసారి గురజాడ వీరాభిమానుల్ని కూడా యిబ్బంది పెట్టింది.

"ఇంగ్లీషు విద్యమూలంగా జరిగిన భావ మధనంలో అమృతంతో పాటుగా హాలాహలమూ పుట్టింది. అంధ విశ్వాసాలతో పాటు మంచినీ తిరస్కరించడం జరిగింది. తన మిడిమిడి జ్ఞానంతో కాళిదాసు కవిత్వాన్ని తోసిపారేసి, పనికి వచ్చేదొక్కటీ మన పుస్తకాలలో లేదని తీర్పు చెప్పిన కరటక శాస్త్రి శిష్యుడు యిందుకొక మచ్చుతునక" (శెట్టి ఈశ్వరరావు)

నిజానికి కరటక శాస్త్రి శిష్యుడు కూడా గురజాడే. గురజాడ పాత్రలలో వైవిధ్యం శూన్యం. అన్ని పాత్రలూ విదూషక పాత్రలే. యీవిదూషకత్వాన్ని భరించలేకే చలం కన్యాశుల్కాన్ని కుళ్లు నాటకం అన్నాడు.

కాళిదాసుని కరటకశాస్త్రి శిష్యుడు ఆక్షేపించడం వెనుక దాగిన తత్వం గురజాడదే. గురజాడ కాల్పనికతకి తీవ్ర విరోధి. కవుల కల్పనలపై గురజాడ తీవ్రంగా విరుచుకుపడ్డాడు.

**“కవుల కల్పన కలిమిలెన్నో**
**వన్నెచిన్నెలు గాంచు వస్తువు**
**లందు వెర్రిపురాణ గాథలు**
**నమ్మజెల్లునె పండితుల్”**

అని కవుల కల్పనల్ని అధిక్షేపించాడు గురజాడ.

మరి కవుల కల్పనలకి విరుగుడు ఏమిటి?

**కన్నుగానని వస్తుతత్వము**
**కాంచనేర్పరు లింగిలీజులు**
**కల్ల నొల్లరు వారి విద్యల**
**కరచి సత్యము నరసితిన్**

వస్తుతత్వాన్ని చూపగలిగినది, అసత్యలేశం కూడా లేనిదీ ఆంగ్లేయుల విద్య. దానివల్లనే సత్యం గోచరిస్తుంది అని గురజాడ అభిప్రాయం.

ఐతే మనకి జీవితమంతా పురాణాల్తో అల్లుకుపోయింది. పురాణాన్నీ చరిత్రనీ విడదీయడం కష్టసాధ్యం. పల్నాటివీర చరిత్రయైనా, భారత రామాయణాలైనా, జాంబపురాణమైనా వాస్తవమూ కల్పనలని వేరుపరచడం అసాధ్యం. ద్రష్టకీ దృశ్యానికీ దూరం లేదు. అందువల్ల సబ్జెక్టివ్, ఆబ్జెక్టివ్ విభజన అసాధ్యం.

పూర్తి ఆబ్జెక్టివ్‌గా వస్తుపరంగా ఆలోచించి సత్యాన్ని నిగ్గుతేల్చడం అసాధ్యం. అందుకే భారతీయులకి పురాణమే చరిత్ర, చరిత్రే పురాణం. అదొక పాట, అదొక ఆట, అదొక గానం రామాయణమైనా, పల్నాటి వీరగాథయైనా ఉద్వేగభరితమైన గానాలుగానే ప్రాచుర్యంలోకి వచ్చాయి.

కాని గురజాడకి వస్తుతత్వం కావాలి. అందుకే ప్రజల నాల్కలపై నాట్యం చేసే శబ్ద జాలంలో కాక కవిలికట్టల్లో సాహిత్యమూలాల్ని వెతకడం మొదలుపెట్టాడు గురజాడ. అందుకే మెకంజీ బయట పెట్టిన కైఫీయతులని కొనియాడుతాడు గురజాడ. ఆనాటి ప్రజాహృదయం, ఆనాటి రోజుల ముద్ర కైఫీయతుల్లో వుందంటాడు.

అంటే పురాణగాథల్లోనూ, గానాల్లోనూ కాక లిఖితపూర్వకమైన స్థల చరిత్రల్లో వాస్తవికత వుందని, దానినుంచే సాహిత్యం స్ఫూర్తిని పొందాలని అంటాడు గురజాడ. (కన్యాశుల్కం పీఠిక) పురాణాల్ని విమర్శించిన గురజాడ డామన్ పితియస్ పేరుతో పాశ్చాత్య పురాణగాథని గేయంగా వ్రాశాడు. పురాణమైనా పాశ్చాత్యులు రచిస్తే దైవ ప్రసాదంకింద లెక్క.

కానీ కాళిదాసునే తీసుకోండి ఆయన దృక్పథం వేరు. అది భారతీయ దృక్పథం. ఉదయన కథాకోవిదాన్ గ్రామవృద్ధాన్' ఉదయన కథల్ని గానం చేసే గ్రామీణ పెద్దల గురించి ప్రస్తావిస్తాడు మేఘ సందేశంలో కాళిదాసు.

అటువంటి గ్రామీణ అలగాజనం నుంచి పురాణగాథల్ని వాటి సహజ ఉచ్ఛారణతో, నిసర్గ సౌందర్యంతో ప్రజల విశ్వాసాలతో కల్పనలతో సహా తెలుసుకుంటే అది మంచి సాహిత్య భాష కాగలుగుతుందని గురజాడ ఒప్పుకోడు. పైగా మెకంజీ బైట పెట్టిన స్థల చరిత్రల్ని మాత్రమే ప్రస్తావించి అవే సాహిత్యానికి దిక్కూ, మొక్కూ అంటాడు.

గ్రంథస్థమూ లిఖితమైనదీ వస్తుగతమైనదే సత్యం. యీవిధంగా గురజాడ సాహిత్యం నుంచి ప్రజల్ని మినహాయిస్తాడు. వారి మౌఖిక సంస్కృతిని వెలేస్తాడు. తద్వారా వలసవాదానికి నమ్మకమైన బంటుగా నిరూపించుకొంటాడు. సజీవమైన తెలుగు భాషే, ప్రాచ్య ఇటాలియన్ అనే భాషే కావాలి అని ప్రకటించడం ద్వారా పాశ్చాత్యుల గుర్తింపుకి నోచుకొనే భాష కావాలని అటువంటి తెలుగు భాష కావాలని ప్రకటిస్తాడు గురజాడ. అంటే తెలుగు తెలుగుగా కాక ప్రాచ్య దేశాలకి సంబంధించిన యిటాలియన్ భాషగా పాశ్చాత్యభాషగా మనగలగాలి అని తనని మరో మెకాలేగా నిరూపించుకొంటాడు గురజాడ. ఆ కారంలో తెలుగు భాషగానూ, సారంలో పాశ్చాత్య భాషగాను మనుగడ సాగించాలి అనేదే గురజాడ తత్వం.

పాశ్చాత్య ప్రేరేపితమైన దేశ భాషల ఉద్ధరణ అనేది ఆ భాషలకే శ్రాద్ధకర్మగా మారింది. బైబిల్ అనువాదాలతో మొదలైన ఉద్ధరణ కార్యక్రమం. ఫక్తు పాశ్చాత్య అనుకరణగా మారిపోయింది. ప్రజలలో వున్న కల్పనల్నీ ఊహల్నీ మౌఖిక సంస్కృతినీ మినహాయించింది.

తెలుగు భాష ఉద్ధరణ కార్యక్రమం ఎందుకు? అది చనిపోయిందా? ఆధారని అరికట్టింది, ఆ ప్రవాహానికి కృత్రిమంగా ఆనకట్టలు కట్టింది పాశ్చాత్య క్రైస్తవ వలసవాదమే. సంస్కర్తల పద్ధతి యెటువంటిదంటే, వైవిధ్యంతో కూడిన వ్యవసాయాన్ని అరికట్టి కృత్రిమ వ్యవసాయ పద్ధతుల్ని అనుసరించడం వంటిది.

అందుకే గురజాడలాంటివాళ్లు పురాణగాథల్ని అపహాస్యం చేసిన తర్వాతే పౌరాణిక పద్య నాటకాలు విజృంభించాయి. ఎన్నో నాటక పద్యాలు గ్రామీణుల నాలుకలపై నాట్యం చేశాయి. గురజాడ కన్యాశుల్కం కాదు. భారత రామాయణ గాథలపై ఆధారపడ్డ నాటక పద్యాలే ప్రజల్లోకి విస్తరించాయి. వొక విధంగా పురాణ గాథలు గురజాడ పై కక్ష తీర్చుకున్నాయి. అతని వ్యావహారిక భాషోద్యమాన్ని క్రైస్తవ వలసవాద అవకాశవాదంగా నిరూపించాయి.

లోకమందలి మంచి చెడ్డలు లోకులెరుగుదురా అని గురజాడ ప్రశ్నించాడు. కాని గురజాడకి మంచి చెడ్డలు అనేవి తెలుసా? అటువంటి విచక్షణ ఆయనలో వుందా! కొత్త మిన్కుల తెలివి పటిమను, మంచి చెడ్డలు మార్చితిన్ - ఇంగ్లీషు చదువుల వల్ల అబ్బిన తెలివితో మంచిని చెడ్డగా, చెడును మంచిగా మార్చి తలకిందులు చేశానని గురజాడ చెప్పుకొన్నారు.

మొదటి స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో వలసవాదంపై తిరుగుబాటుని ప్రేరేపించడానికి  ఢిల్లీలోని పత్రికలు భారతగాధని దృష్టాంతంగా చూపేవి. (లాస్ట్ మొగల్) ఎందుకంటే భారతంలో మంచి చెడుల మధ్య విభజన రేఖ వుంది, సంఘర్షణ వుంది. స్థానికతకీ వలస వాదానికీ మధ్య యుద్ధానికి సంకేతంగా మారే వీలుంది.

జార్జి చక్రవర్తిని కీర్తించిన గురజాడ ఆసంఘర్షణని ముగించేశాడు. ఆంగ్లేయుల విధానాలు స్థానిక సంస్కృతిని దెబ్బతీశాయని హరికథాపితామహ ఆధిభట్ల

నారాయణదాసు బాధపడ్డారు (నా ఎరుక). కాని గురజాడలో అటువంటి చింత అణుమాత్రమైనా లేదు. అందుకే తన విదూషకత్వంతో భారతీయమైన ప్రతి అంశాన్నీ అధిక్షేపించాడు.

ప్రతిసనాతనమైన అంశాన్నీ అపహాస్యం పాలు చేశాక ఆదర్శపాత్రగా మిగిలిందెవరు? విదూషకుడు ఆదర్శపాత్ర కాగలడా? గిరీశం గురజాడలోని విదూషకుడే కదా?

యీ హాస్య సముద్రంలో గిరీశం కొట్టుకుపోయాడు దారి తప్పిపోయాడు. నాయక గుణాల్ని కోల్పోయాడు. గురజాడ శిష్యుడు భక్తుడు అయిన బుర్రా శేషగిరిరావు కూడా గిరీశం గురించి ఆలోచనలో పడ్డాడు.

గిరీశం వంటి నాయకుని పెట్టి సంఘ సంస్కరణోద్యమమును వేళా కోళములోనికి దించి యుపకృతికి మారు అపకృతియే చేశారని విమర్శించాడు.

ప్రతిదీ అధిక్షేపానికి గురైనట్లే సంఘసంస్కరణ కూడా అపహాస్యానికి గురైంది. అసలు సంగతి మంచి అనేది లవలేశం కానరాకపోవడం.ప్రతిపాత్ర అవకాశవాదపాత్రే. అవకాశవాదం, లౌక్యం యివి తప్ప గురజాడ పాత్రలో మరేమీ కానరాదు. సనాతనులూ, వైదికులూ అవకాశవాదులే. వారిని వెటకారం చేసే గిరీశమూ అవకాశవాదే.

కాని యెంత చెప్పినప్పటికీ గిరీశమే గురజాడ హృదయం. అందుకే ఆధునికతలోని సహజ లోపాల వల్ల దారితప్పిపోయిన గిరీశాన్ని యెలాగో అలా హీరోని చెయ్యాలనే చూశాడు గురజాడ. అతడు జీరోగా మిగిలిపోకుండా వుండాలని ఆశపడ్డాడు. ఎందుకంటే హీరో కాగలిగినవాడు సనాతనుడు కాక ఆధునికత్వానికి ప్రతినిధి కావాలి. అతడు గిరీశమే.

కన్యాశుల్కానికి అనుబంధంగా రెండు నాటకాలు రాయాలని గురజాడ సంకల్పించాడు. కొండు భట్టీయం రాశాడు. యీ నాటకంలో గిరీశం హఠాత్తుగా ఆదర్శపాత్రగా మారిపోవడాన్ని చూసి శెట్టి యీశ్వరరావుగారు ఆశ్చర్యపోయారు. యీ నాటకంలో గిరీశం పెంకి ఘటమే కాని దుష్టుడూ భ్రష్టుడూ కాదు. పరోపకారి విధవా వివాహం జరిపించడానికి మనసారా పూనుకొంటాడు. లౌక్యమూ, వంచన

కలగలసిన గిరీశం హఠాత్తుగా మంచివాడుగా మారిపోవడం కొందరు మేధావుల్ని ఆశ్చర్య పరిచింది. గిరీశం గురజాడ హృదయం కావడంవల్ల, వొక ఆదర్శరూపం యివ్వడానికి పాట్లు పడ్డాడు గురజాడ.

గురజాడ అనుయాయి ముని సుబ్రహ్మణ్యం గిరీశాన్ని ఉపాధ్యాయుడు, ప్రేమికుడు, సంఘ సంస్కర్త, రాజకీయవేత్త... ఇలా సకల గుణాభిరాముడిగా వర్ణించాడు గురజాడకి వ్రాసిన లేఖలో. (గురుజాడలు, మనసు ఫౌండేషన్) గురజాడ ఈ అభిప్రాయాన్ని కాదనలేదు. ఇటువంటి అభిప్రాయాలవల్లే కావచ్చు. కొండుబట్టీయంలో గిరీశాన్ని సంస్కరించాడు గురజాడ. కొండుబట్టీయం తృతీయాంకంలో దివాన్ బహదూర్ రాజారాం గిరీశాన్ని సంఘ సంస్కరణ కెప్టెన్‌గా వర్ణించాడు. కన్యాశుల్కంలో స్త్రీలోలుడైన గిరీశం కాస్త ఏకపత్నీవ్రతుడిగా మారిపోయాడు. ఐతే తెల్లదొరలతో స్నేహమనేది ఈ రెండు నాటకాలలోని గిరీశాలకి సమాన లక్షణం. ఎందుకంటే గురజాడ దృష్టిలో అదే పెద్ద క్వాలిఫికేషన్.

గిరీశం నిజస్వరూపం కాని గురజాడ నిజస్వరూపం కాని దాచేస్తే దాగేవి కావు.

కొండుభట్టీయంలోని గిరీశం తన మతాన్ని గురించి యిలా చెప్తాడు. "నామతం నాకే పోల్చడానికి దుస్తరంగా వుందనుకొంటాను. యెండవేళవొక మతం, చల్లనివేళ వొక మతం, కడుపుకాలుతూ వున్నప్పుడు వొక మతం, కడుపునిండినపుడు వొక మతం; అలసి వున్నపుడో మతం, ఒంటరిగా వున్నపుడో మతం. అతివ చెంతనున్నపుడో మతం, లంగరులేని నావలాగ మనస్సు యొక్క శరీరము యొక్క స్థితిని బట్టి చలిస్తూ వుంటుంది."

అసలు విషయం లంగరులేని నావలా చలిస్తుండడం. కన్యాశుల్క గిరీశం అననే అన్నాడు. ఒపీనియన్సు మారుస్తూ వుంటేకాని పొలిటీషియన్ కాలేడు. యిది లంగరులేని తత్వం కాదు. లంగరుని బ్రిటీష్ సింహాసనానికి అప్పజెప్పిన తత్వం. పైకి లంగురులేని తత్వంలా భాసిస్తుంది. యీ అధిక్షేపం, యీ హాస్యం, యీ విదూషకత్వం, భారతీయుల గతంపైనే వర్తమానంపైన కానేకాదు. ఎందుకంటే వర్తమానం అంటే క్రైస్తవవలసవాదమే. దానిలో యెలాగోలా హీరోని వెతికి పట్టుకోవడానికి ప్రయత్నించాడు గురజాడ. (వచ్చెనిదె బంగారుకాలం' అని మెచ్చుకొన్నాడు యింగ్లీషువాళ్ళ పాలనా కాలాన్ని)

యీ పాశ్చాత్య క్రైస్తవ విద్యే సంస్కారమే జీవితానికి అర్థాన్ని యిస్తుంది. వొక మతాన్ని యిచ్చేది కూడా ఆసంస్కారమే. నిజానికి మతం అనే భావన వలసవాద అనంతరం ఆవిర్భవించిందే. వొక విశ్వజనీన గ్లోబల్ మతం కోసం ఆధునికులు ప్రయత్నించారు. వొకే గ్రంథం, వొకే మతం యివి జీవితానికి సార్థకతను చేకూరుస్తాయని భావించారు.

వివేకానంద, రాజారామమోహనరాయ్‌లాంటి ఆధునికులు వొక విశ్వమతం – యూనివర్సల్ రెలిజియన్ కోసం కలగన్నారు. విశ్వమతం, విశ్వమానవుడు లాంటి భావనలు వీరవిహారం చేశాయి. స్థానిక సంస్కృతులూ, ఆచారాలూ యీసడించుకో బడ్డాయి.

**మతములన్నియు మాసిపోవును**
**జ్ఞానమొక్కటె నిలిచి వెలుగును**
అన్నాడు గురజాడ.

ఏకైక జ్ఞానం, అందరికీ కలిపి వొకే జ్ఞానం అందరూ అంగీకరించే జ్ఞానం యిది మాత్రమే మిగుల్తుంది. అదే ఆంగ్లేయుల జ్ఞాన పద్ధతి.

యిలా మతాలన్నీ మాసిపోయి జ్ఞానం వొక్కటే వెలుగొందుతుందన్న గురజాడ భగవద్గీతని ఆదర్శగ్రంథంగా చూపుతూనే వుంటాడు.

ముక్కు మూసుకొని కొంగజపం చేసే వైదికులలోకన్న, బౌద్ధజైనులలోనే గీతాసారం యిమిడివుందని వొక పాత్రచేత చెప్పిస్తాడు బిల్హణీయం నాటకంలో. వారిలో దైవీగుణాలు ఉన్నాయి అంటాడు. భూతదయ, అహింసలని ఉత్తమ గుణాలుగా చెప్తాడు. క్రైస్తవంతో బౌద్ధాన్ని పోలుస్తాడు వొక లేఖలో.

మనకి క్రైస్తవాన్ని పోలిన మతమూ, మతగ్రంథమూ కావాలి. అదే రేషనల్ రెలిజియన్ కాగలుగుతుందని గురజాడ అభిప్రాయం. గురజాడ కొండుభట్టీయం అనే నాటకం తృతీయాంకంలో దివాన్ బహదూర్ రాజారామ్‌గారి నోటివెంట మతం గురించి తన దృక్పథాన్ని వ్యక్తం చేస్తారు. గురజాడ రాజభక్తుడు గనుక రాజుగారి ముఖతః ఈ మాటలు పలికిస్తారు. ఇంతకీ రేషనల్ రెలిజియన్ అంటే ఏమిటి? 1)

బైబిల్‌లా ఒక గ్రంథం అవసరం. మనదైన గ్రంథం అవసరం, ఆ గ్రంథం పాశ్చాత్యులు మెచ్చినదై ఉండాలి. అటువంటిది భగవద్గీతేనని అంటాడు గురజాడ. ఏ విషయంలోనైనా మతం, సాహిత్యం, విద్య, అన్నిచోట్ల పాశ్చాత్యుల ప్రమేయాన్ని గురజాడ పునఃపునః బలపరుస్తారు. 2) మతం అనేది అలగాజనానికి చెందిన జానపద విశ్వాసాలకి దూరంగా ఉండాలి. చండాలుడు ఎనుబోతును వేటవేసి మరిడమ్మకు పూజచేస్తాడు. అటువంటి మతాన్ని నిర్మూలించాలి. రేషనల్ రిలిజియన్ స్థాపించాలి. పై అంతస్థులవారి విలువలని స్థాపించాలి. ఇది కొండుభట్టీయంలోని ప్రతిపాదన. ఈ ఆలోచన బౌద్ధ క్రైస్తవాలని ఏకకాలంలో గుర్తుకు తెస్తుంది. అసలు విషయం స్థానిక విశ్వాసాలనన్నిటిని క్రైస్తవ హేతువుతో క్రైస్తవ కరుణభావంతో నిర్మూలించాలి. ఇదే ప్రచ్ఛన్న క్రైస్తవమైన నూతన హిందూమత ఆవిర్భావానికి కారణమైంది.

భూతదయ, అహింస అనేవి వలసవాదులు భారతదేశంపైన యెక్కుపెట్టిన అస్త్రాలు. మూఢ విశ్వాసాలతో వొకరినొకరు హింసించుకొనే భారతీయుల్ని సంస్కరించడానికే పాశ్చాత్యులు మన దేశానికి వచ్చారు. వాళ్ళు కరుణతో మనని ఉద్ధరించారు. జార్జి చక్రవర్తి గురించి యిలా అన్నాడు గురజాడ:

"మర్మమెరుగని ధర్మమనియెడి
నిర్మలంబగు నీతిపథమున
పేర్మి ప్రజలను మలచునేర్పరి
జార్జి మనవలయున్"

(ఆంగిలేయుల ధర్మరాజ్యము") ధర్మపథం, నీతిపథం, పాశ్చాత్యులదే. వారే హింసాపరులైన మన ప్రజలని సంస్కరించగలరు. వారి క్రైస్తవ నీతే మనని ఉద్ధరించగలదు అని గురజాడ అభిప్రాయం.

పాశ్చాత్యులకి బైబిల్‌లా మనకి వొక గ్రంథం కావాలి. అదే వల్లెవేయడం మీద కాక అర్థం మీద ఆధారపడాలి. అందుకే భగవద్గీతని మతగ్రంథంగా స్వీకరించాడు గురజాడ. శబ్దంమీద, స్వరంమీద, ఉచ్చారణమీద, మౌఖికత మీద, పరంపరమీద ఆధారపడిన వేదాన్నీ వైదిక సంస్కృతినీ అడుగడుగునా వెక్కిరించాడు. కొంగజపంగా

అవహేళన చేశాడు. ఎందుకంటే అవి సజీవ సంస్కృతికి ప్రతీకలు. బ్రాహ్మణ సంబంధమైనదైనా బ్రాహ్మణేతరమైనదైనా మౌఖిక సంస్కృతిని తిరస్కరించాడు. గురజాడ. అది ఆయన గారి ఆంగ్లేయ అనుకరణలో ప్రధానమైన అంశం. అందుకే బిల్హణీయంలో విదూషకుడు శబ్ద ప్రమాణాన్ని తిరస్కరించాడు.

"అనర్థకా మంత్రాః" మంత్రానికి అర్థం లేదు అంటాడు కౌత్సుడు అనే ప్రాచీన వేదపండితుడు (నిరుక్తం) యీ అభిప్రాయానికి కారణం వేదం శ్రుతి కావడమే. సుస్వరంగా వేదమంత్రములు గురువుగారి ద్వారా శిష్యునికి సంక్రమిస్తున్నాయి. యిది పరంపర. యిది సంప్రదాయం. యీవిధంగా వొకరినుంచి మరొకరికి గురు శిష్యపరంపరగా వేదార్థం సక్రమింపజేయబడడంలేదు. వేదార్థం ఐచ్ఛికం మాత్రమే. పైగా వేద మంత్రాలలో చిన్న మార్పు కూడా పూర్తి నిషిద్ధం.

బ్రాహ్మలు సోమపానం చేసి వేద పారాయణం చేస్తే తొలకరి కప్పల అరుపులులా వుంటుందని ఉపమానం కల్పించరు. రుగ్వేదంలో ఒకరు ఉచ్చరిస్తుంటే మరొకరు అనుకరిస్తూ ఉచ్చరించడాన్ని యీ విధంగా వర్ణించారు. దీనిని కొండు భట్టీయం నాటకంలో పరిహాసం చేస్తాడు గురజాడ.

వైదిక బ్రాహ్మలలో నమకచమక పారాయణ నిత్యవిధిగా వుంది. మరేదీ అంత ప్రాముఖ్యం వహించదు. చమకంలో 'చ' అనే అక్షరం పదే పదే పునరుక్తమౌతుంది. దీనిని ఆధారం చేసుకొనే అపహాస్యాన్ని కల్పిస్తాడు గురజాడ కన్యాశుల్కం నాటకంలో. మరోచోట గిరీశం అగ్నిహోత్రావధానులుతో అంటాడు. పద్యాల్ని మొట్టమొదట వేదంలా భట్టీయం వేయిస్తాను. అర్థం సంగతి తర్వాత అంటాడు.

వేదంలో సుస్వర ఉచ్చారణే ప్రధానం. దోషభూయిష్ఠమైన ఉచ్చారణ నరకంలోకి నెడ్తుందని ఆర్యోక్తి. యీ మౌలిక వైదిక భావనని తీవ్రంగా పరిహసిస్తాడు గురజాడ తన రచనల్లో. దీనికి ముక్తాయింపుగా బిల్హణీయం నాటకంలో విదూషకుడు శబ్దంకంటె అర్థమే ప్రధానమని కుండబద్దలు కొడ్తాడు. శాబ్దికులు – శబ్దం గురించి విచారం చేసే వైయాకరణులకన్న, అర్థప్రాధాన్యం గల తార్కికులే గొప్పవాళ్లు అంటాడు.

అర్థానికీ తార్కికతకీ ప్రాధాన్యం యిస్తూ వైదిక సంస్కృతిపై అధిక్షేపాల్ని యెక్కుపెడ్తాడు గురజాడ.

బుద్ధుడు కూడా అర్థమే ప్రధానమన్నాడు. అర్థః ప్రతిశరణం, నవ్యంజనమ్ అర్థమే ప్రధానం, శబ్దం కాదు అన్నాడు బుద్ధుడు. యీ అర్థ పరత్వం గొప్ప తార్కికతకి దారి తీసింది బౌద్ధంలో.

యీ బౌద్ధ దృష్టికి వలస క్రైస్తవ బానిస బుద్ధిని జతచేశాడు గురజాడ. అందువల్ల శబ్ద పరతంత్రతని పరిహాసం చేస్తూ యింగ్లీషు చదువులే శరణ్యమన్నాడు. పొట్టకూటికైనా, కోర్టు వ్యవహారాల్ని యెదుర్కోవాలన్నా యింగ్లీషు చదువులే శరణ్యం. గిరీశం తనకి కోర్టు వ్యవహారాల్లో గల ప్రావీణ్యాన్ని గురించి లెక్చర్లు యిస్తూ వేద పండితుడైన అగ్నిహోత్రావధాని దృష్టిని ఆకర్షిస్తాడు.

బ్రిటీష్ కాలంనాటి శృంగేరీ పీఠాధిపతి జగద్గురు చంద్రశేఖర భారతీ స్వామివారు వొక విషయాన్ని స్పష్టం చేస్తారు. వైదిక బ్రాహ్మణ కుటుంబాల వాళ్లు తమ పిల్లల్ని లాయర్లు చేయడానికే యిష్టపడ్తున్నారని స్పష్టం చేస్తారు. వేదం చదువుకున్న వాళ్లుకూడా బారిష్టర్లని చూసి యీర్ష్య పడ్తున్నారంటారు. యిది ఆంగ్లేయ విద్య తీసుకువచ్చిన మార్పు. (జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామివారితో సంభాషణలు, శృంగేరి శారదాపీఠం).

యీ మార్పులో భావదాస్యాన్ని చూడడానికి యిష్టపడడు గురజాడ. ఆంగ్లేయ విద్య, ఆంగ్లేయ ప్రజ్ఞ యెంత విధ్వంసానికీ 'కుళ్లు'కీ కుహకాలకీ కారణమైనా వస్తుతత్వాన్ని తెలిపేదీ, సత్యానికి దారితీసేదిగా అభివర్ణిస్తాడు. యీ విధంగా లౌకిక విద్య పేరుతో లౌక్యాన్ని బోధిస్తాడు గురజాడ.

శబ్దం కంటె అర్థం ప్రధానమని బోధించి, అర్థం అంటే డబ్బు, ప్రయోజనం, తర్కం యివి మాత్రమే ప్రధానం అనే దృష్టిని బలపరిచి వలసవాద ఆధునిక దృష్టిని పరమసత్యంగా స్థాపిస్తాడు గురజాడ.

గురజాడకి విరుగుడుగా కనిపిస్తాడు ప్రముఖ కథా రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి. యీయన బ్రాహ్మణ కుటుంబాల్లోని దోషాల్ని యెత్తి చూపినప్పటికీ, యింకా

వర్తమానంలో వెలుగొందుతున్న వేదగానాల్నీ యజ్ఞాల్నీ గౌరవంగా ఉద్వేగభరితంగా వ్యక్తం చేస్తారు. 'అనుభవాలు జ్ఞాపకాలు' అనే గ్రంథంలో. అది ఆయన ఆత్మకథ. అవధానాల్ని విమర్శించినప్పటికీ అవధానం చేసే పండితులలో కనబడే ఉదాత్తతని స్పష్టం చేయడానికి వెనుకాడడు. శిష్యాదిచ్ఛేత్ పరాజయం అని భావించి తనపై విజయం సాధించిన శిష్యుణ్ణి మనసారా మెచ్చుకున్న అవధాని గురించి ఉ ద్వేగభరితంగా వర్ణిస్తాడు. తెల్లవాళ్లనీ దిగ్భ్రమకి గురి చేసిన జ్యోతిష్య పండితుల్ని గురించి వర్ణిస్తాడు. స్థానిక జ్ఞానాన్ని మెచ్చుకుంటాడు.

యీ వైదిక బ్రాహ్మణుడు యింగ్లీషు భాషలో యే మాత్రం ప్రవేశంలేనివాడు. ఆడవాళ్ల కబుర్ల నుంచి యితర కులాలల వారి సంభాషణల నుంచి తెలుగుని నేర్చుకొన్నానని సవినయంగా చెప్పుకున్నాడు. అంటే స్థానిక మౌఖిక సంస్కృతి నుంచే మంచి సాహిత్యం అభివృద్ధి చెందుతుందని ఆయన భావించాడు. యీయనలో బౌద్ధ జైనాలపట్ల వ్యతిరేకత కూడా కనబడ్తుంది. "అనుభవాలు జ్ఞాపకాలు"లో కారణం శబ్ద ప్రమాణం పట్ల మక్కువే. (బౌద్ధ క్రైస్తవాలు రెండూ పరధర్మాలేనంటారు శ్రీపాద).

ఐతే గురజాడ మాత్రం తెలుగు భాష అభివృద్ధి చెందాలంటే ఆంగ్లేయులు పూనుకోవలసినదేనని భావించాడు. ఇంగ్లీషు ఆచార్యులు దేశభాషల్లో కృషి చేయనంతకాలం తెలుగు సాహిత్యం వృద్ధి చెందదని భావించాడు. ఏభై ఏళ్లుగా పాశ్చాత్య సంస్కృతి ఆధిపత్యం సాగుతూవున్నా సాహిత్య రచనాస్థాయి తక్కువ మెట్టలో వుండడాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. (కన్యాశుల్కం రెండో కూర్పు పీఠిక గురించి శెట్టి ఈశ్వరరావు వివరణ) సంస్కృతం, తెలుగు భాషలకి పెద్ద దిక్కు ఆంగ్లేయులు పాశ్చాత్య ఆధిపత్యాలేనని గురజాడ దృఢాభిప్రాయం. (దీనికి పూర్తి విరుద్ధమైన దృష్టి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారిది) విశ్వవిద్యాలయాల్లో కాదు ప్రజల నాలుకలపై సరస్వతి వుంది. ముఖేముఖే సరస్వతీ.

యిట్టి సరస్వతీ అనుగ్రహానికి గురజాడ దూరమయ్యాడు. కారణం శబ్దాన్ని పరిహసించి అర్థాన్ని వరించాడు. మౌఖికతని పరిహాసం చేసి ఆంగ్లేయుల పంజరంలో యిరుక్కుపోయాడు. బౌద్ధజపం చేస్తూ క్రైస్తవంలో కూరుకుపోయాడు. గ్రంథంలో

మక్షికంగా మారాడు. (గద్దర్, గోరటి వెంకన్న వంటి గాయకులు వైదిక మౌఖిక సంప్రదాయంలోని వారే).

సరస్వతీ అనుగ్రహానికి దూరం కావడం వల్లే యీయన స్త్రీ పాత్రలు కూడా స్థానికతను కోల్పోయాయి. ఉదాహరణకి మధురవాణి.

మధురవాణి పాత్రని అద్భుతంగా చిత్రించాడని అందరూ అంటుంటారు. అసలు సమస్య ఆమె భారతీయ వేశ్యలా కనబడదు.

మధురవాణి అంటూ ఒక వేశ్య శిఖామణి యీ కళింగరాజ్యంలో వుండకపోతే భగవంతుడి సృష్టికి యెంత లోపం వచ్చివుండును అని కరటక శాస్త్రులు ఒకచోట అంటాడు.

అసంగతమైన విషయమేమిటంటే యింతటి వేశ్యాశిఖామణికి శ్రీకృష్ణుణ్ణి శ్రీకృష్ణభక్తిని వొక లాయరు సౌజన్యారావు పంతులు బోధించడం.

గురజాడ రచనా కాలంనాటి వేశ్యలు నేటి వేశ్యలవంటివారు కాదు. ముఖ్యంగా కళింగాంధ్రంలోని వేశ్యలు. నాట్యమూ, గానమూ నేర్చినవారు. యీ విషయం గురజాడ సమకాలికుడైన ఆదిభట్ల నారాయణదాసు రచించిన ఆత్మ కథ 'నా ఎఱుక' చదివితే అర్థమౌతుంది. వొక వేశ్య నారాయణదాసుగారి గీతాలను అభ్యాసం చేసి కచేరీలు చేసి డబ్బు సంపాదిస్తుంది, మరొక వేశ్య గురించి అభినయ కుశలురాలు అని మెచ్చుకుంటారు నారాయణదాసు.

అంతేకాదు ప్రముఖదేవదాసి బెంగుళూరు నాగరత్నమ్మ రాధికా సాంత్వనానికి స్వంతంగా పీఠికరాసి ప్రచురించినది ఆకాలంలోనే. ఆ గ్రంథమంతా శ్రీకృష్ణుని శృంగారలీలలే. ఆ గ్రంథాన్ని బ్రిటీష్‌వారి వద్దగల పరపతితో నిషేధింపజేసినది ప్రముఖ సంస్కర్త కందుకూరి వీరేశలింగం పంతులు అశ్లీలములైన ఆంగ్ల నాటకములెన్నిటినో అనువాదం చేసిన సంగతిని గురజాడవారే విమర్శిస్తారు (కావ్యమునందు శృంగారము). ఆంగ్లేయ శృంగారం కావడం వల్ల కావచ్చు ఆంగ్లేయులకి నిషేధార్హంగా భాసించలేదు.

అసలు సంగతి మధురవాణికి శ్రీకృష్ణుణ్ణి వొక లాయరు పరిచయం చేయడం.

దేవదాసీలూ, వేశ్యలూ పాడేపాటల్లో రసికుడైన శ్రీకృష్ణుని ప్రసక్తి సర్వసాధారణం. మా కోనసీమలో భామాకలాపం పేరుతో శ్రీకృష్ణుని కథని ప్రదర్శించేవారు. భగవద్గీతని మధురవాణికి బహూకరించిన లాయరు వొకమాట అంటాడు గీతని చదివినవారికి విలువలేని గొప్ప స్నేహితుడొకడు దొరుకుతాడు అంటాడు. వింత యేమిటంటే – యెవరండి ఆ స్నేహితులు అని మధురవాణి అడగడం. అంతటితో వూరుకోక శ్రీకృష్ణుడు సానిదానితో కూడా స్నేహం కడతాడా అని ప్రశ్నించడం.

యింతకీ కృష్ణుడంటే తెలియని వేశ్య, అతడికి సానివాళ్లతో గల సుదీర్ఘ స్నేహాన్ని మరచిన వేశ్య మధురవాణి అసలు భారతీయురాలేనా, తెలుగు వేశ్యయేనా యింగ్లాండునుంచి షిప్పులో అప్పుడే దిగిందా? పైగా సౌజన్యారావనే నియోగి లాయరు ఆంగ్ల విద్యావంతుడూ, శ్రీకృష్ణున్ని ఆమెకు కొత్తగా పరిచయం చేయడం. యెంత వైరుధ్యం?

విశ్వనాధవారు వేయిపడగలలో సృష్టించిన గిరిక అనే దేవదాసిని గుర్తుకు తెచ్చుకోండి. ఆమె కృష్ణభక్తురాలు, గొప్ప గాయని, సంప్రదాయజ్ఞురాలు.

సంప్రదాయంతో సంస్కృతితో సంబంధంలేని వేశ్య పాత్రని సృష్టించడం ద్వారా గురజాడ, ఆస్తిహక్కు తమదైన సంస్కృతి కళలు విద్య, కలిగిన వేశ్యా వ్యవస్థనుంచి, శరీరాన్ని సరుకుగా అమ్ముకోవడం ప్రధానంగా ధనస్వామ్య వ్యవస్థలోని సెక్స్ వర్కర్ విధానంలోకి మార్గాన్ని యేర్పరిచాడు.

పైగా గురజాడ మధురవాణికి పరిచయం చేసింది గీతాకృష్ణుడు. అప్పటికే బెంగాలీ ఆంగ్ల విద్యావంతులు రసికుడైన భాగవత కృష్ణుణ్ణి పక్కనబెట్టి, వేదాంతియైన గీతాకృష్ణుణ్ణి ప్రాచుర్యంలోకి తెచ్చారు. యిదొక మత సంస్కరణ. ఆర్య సమాజికుడు దయానంద సరస్వతి భాగవతాన్ని నిషేధించాలన్నాడు. యీ సమయంలో గీతాకృష్ణుణ్ణి బయటకు తెచ్చి, అతనిలో బుద్ధుణ్ణి చూసి అంతిమంగా క్రైస్తవ ప్యూరిటన్ పద్ధతిని ఆకాశానికి ఎత్తాడు గురజాడ.

దీనిద్వారా వేశ్యలని ఉద్ధరించేదేముంది? వారిని దేవదాసీ సంప్రదాయంనుంచి విముక్తి చేసి, అంతిమంగా మార్కెట్లో సరుకులుగా మార్చడం తప్ప. అందుకే దేవదాసి వ్యవస్థని బలంగా సమర్థించారు బెంగుళూరు నాగరత్నమ్మగారు. ఆవిడ గొప్ప త్యాగరాజ

ఆరాధకురాలు; సంగీత సరస్వతి. ఆ సరస్వతి నుంచి గురజాడ సరిగమలు కూడా నేర్వలేదు. మధురవాణికీ మంజువాణికీ నేర్పలేదు. యిది గొప్ప అపచారం. భరతనాట్యం అంటే సంగీతం అంటే బ్రాహ్మణుల ప్రజ్ఞ అనుకునే ఆంగ్ల విద్యా బానిసలు తప్పమరెవరూ యిట్టి నాటకరచనని మెచ్చలేరు. యింతకీ సర్వం బ్రాహ్మణమయం చేసింది క్రైస్తవుడే. అతని నీడలో నిలిచిపోయినవాడే గురజాడ.

బ్రాహ్మణుల విద్యావిధానాన్నీ సంస్కృతినీ సంప్రదాయాలనీ వ్యంగ్యంగానైనా ప్రస్తావించిన గురజాడ, వేశ్యల దగ్గరికి వచ్చేటప్పటికి వారి ఆటపాటల్నీ విద్యనీ యెందుకు విస్మరించాడు? ఎందుకంటే గ్రంథస్థం కానిది యేదీ విద్యకాదు. విద్య అంటే గ్రంథమే. అంటే బైబిలే గ్రంథం. భారతీయులు బైబిల్‌ని పోలిన గ్రంథం కోసం అన్వేషించక తప్పదు. అదే భగవద్గీత. వేదం గ్రంథం కాదు. అది స్వరబద్ధమైన మౌఖిక సంస్కృతి, వొక పరంపర. దాన్ని విచ్ఛిన్నం చెయ్యక తప్పదు. అందుకే వేదమంత్రాలపై అన్ని విసుర్లు.

మధురవాణి వీణ వాయించడం వొకచోట కనబడ్తుంది నిజమే. విత్తంలేని విద్య దారిద్ర్య హేతువు అని పక్కన బెట్టడంతో ముగుస్తుంది అంతకు మించి ఆమెలోని పాండిత్యం ఎక్కడ బయట పడదు. ధనం అనేది గురజాడ ప్రధాన సందేశం. బ్రాహ్మణేతరుల పాటలూ ఆటలూ కులపురాణాలూ యివేవీ విద్యలూ కావు కళలూ కావు. వాటినుంచి నేర్చుకోవలసింది లేదు. అవి భాషాభివృద్ధికి తోడ్పడవు. అవి లిఖిత సంప్రదాయంలోనివి కావు. అవి లేఖనాలు కావు. బైబిల్ అంటే లేఖనాలే కదా?

అందుకే మెకంజీ బైట పెట్టిన కైఫీయత్తులనే లేఖనాల నుంచే తెలుగు భాష సాహిత్యం అభివృద్ధి చెందగలవంటాడు గురజాడ. మౌఖిక సంప్రదాయంతో తెగతెంపులు చేసుకొని లేఖన సంప్రదాయంలోకి అడుగుపెట్టవలసిన అవసరాన్ని గుర్తు చేస్తున్నాడు ఆంగ్ల మానసపుత్రుడు గురజాడ.

యింతకీ లేఖనం వొక కళ. అరవై నాలుగు కళల్లో అది వొక కళ. అది విద్య కాదు. కళగా మాత్రమే దాని గుర్తింపు. విద్ అనే క్రియా పదానికి జ్ఞానం అర్థం. దానినుంచే వేదం అనే పదం పుట్టింది. విద్య అనే పదం కూడా దానినుంచే పుట్టింది.

ఆయుర్వేదం, ధనుర్వేదం, స్థాపత్యవేదం యిలా అన్ని వేదాలే. అంటే అన్నీ వేదంలా మౌఖికంగా పరంపరగా వొకరినుంచి వొకరికి అందజేయబడేవే. అందుకే వేదం మంత్రరూపంలో ప్రవర్తిస్తే, శాస్త్రాలూ, విద్యలూ కారికలు, సూత్రాలు శ్లోకాల రూపంలో కంఠస్థం చెయ్యడానికి వీలుగా రూపొందించబడ్డాయి. అల్పాక్షరం అసందిగ్ధంగా సూత్రాలు రచించబడ్డాయి.

బౌద్ధంలో కూడా చాలాకాలం శ్రుతి సంప్రదాయమే కొనసాగింది. మౌఖిక విద్యా విధానాన్ని బౌద్ధగ్రంథమైన అంగుత్తర నికాయం కీర్తించింది. మనోభూమికలను పోషించేది పాండితి అంటుంది అంగుత్తరనికాయం. పాండితి. అంటే తిరిగి తిరిగి వల్లె వెయ్యడమే. భట్టీయం మానసిక అభివృద్ధికి తోడ్పడుతుందని యీ బౌద్ధ గ్రంథం బోధిస్తోంది. "బహుశ్రుతులైన భిక్షువులు స్మృతి (జ్ఞాపకం) రూపంలోనే సిద్ధాంతాన్నీ, వినయ గ్రంథాలనూ ధారణ చేస్తారు. సంప్రదాయ సిద్ధంగా పరంపరగా యీ విజ్ఞానం అందజేయబడ్తుంది. వీరు కొన్ని సుత్తాంతాలను ఎవరిచేతా వల్లింపజేయకుండా మరణిస్తే ఆశ్రయహీనమై ఆ సూత్తాంతం మూలచ్ఛేదంగా నశిస్తుంది. (అంగుత్తరనికాయ).

మౌఖిక సంప్రదాయం బౌద్ధంలా చాలాకాలం కొనసాగింది. బౌద్ధ సన్యాసినులు అక్కరిక అనే ఆట ఆడరాదని నిషేధం వుండేది. అంటే వీపుమీద కాని, శూన్యంలోకాని వేలితో అక్షరాలు రాస్తున్నట్లు ఆడతారు. అంటే ఆటగా కూడా లేఖనం చేయరాని పని.

లేఖనంపై తీవ్ర నిషేధం క్రమేపీ సడలింపబడింది. యిందుకు కొన్ని వందల సంవత్సరాల కాలం పట్టింది. కాని లేఖనానికి బౌద్ధం కొంత వెసులుబాటు కల్పించింది. బౌద్ధ సన్యాసినులు సన్యాసులు కళలను వేటినీ అభ్యసించరాదు. నిజమేకాని లౌకికం కాని కళలు అభ్యసించవచ్చు. వాటిలో లేఖనం వొకటి. (శీలవగ్గం). (బౌద్ధయుగం – రత్నాకర బాలరాజు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమండ్రి, 1960).

యీ వెసులుబాటు లేఖన కళకి యివ్వబడడం వల్ల బౌద్ధంలో క్రమేపీ లేఖన కళ అభివృద్ధి చెందింది. కాని దీనికి కూడా చాలా సమయం పట్టింది.

యింక వైదిక సంస్కృతిలోనైతే స్వరానికి మితిమీరిన ప్రాధాన్యం వుంది. స్వరం తప్పడం మహాపాపం, అనర్థదాయకం. బౌద్ధంలో స్వరప్రాధాన్యం లేదు. అందుకే అది ప్రపంచమంతా వ్యాపించగలిగింది. ఐతే బౌద్ధం కూడా లేఖనాన్ని కళగానే భావించింది.

అరవైనాలుగు కళలలో లేఖనం వొకటి. అది విద్యకాదు. ఆంధ్రదేశంలో లేఖనాన్ని అభివృద్ధి పరిచింది నియోగి బ్రాహ్మణులు. సుమతీ శతకంలో కూడా నియోగులు లేఖకులుగా వర్ణించబడ్డారు.

యీ లేఖన కళని తెల్లదొరల ముందు తాకట్టు పెట్టారు నియోగులు. తెల్లదొరల ప్రాపకాన్ని సంపాదించారు. వారివద్ద వ్రాయసగాళ్లుగా మారారు. దుబాసీలుగా అవతరించారు. యింగ్లీషులోకి సంస్కృత గ్రంథాలని అనువదించారు. స్మృతులని అనువదించారు. గ్రంథమే ప్రధానమైన క్రైస్తవుల సంస్కృతితో యీ లేఖన కళాప్రవీణులు మమేకమయ్యారు. (యేనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర)

దీనితో లేఖనం కళస్థాయినుంచి విద్యస్థాయికి తీసుకురాబడింది మౌఖిక సంస్కృతి అధిక్షేపానికి గురైంది. యిదే గురజాడ సాహిత్యసారం.

మౌఖిక విద్యనుంచి లేఖనంలోకి గ్రంథంలోకి విద్యావిధానాన్ని మళ్లించడం వొకయెత్తు. దానికి క్రైస్తవ సంస్కృతిలోకి మళ్లించడం, ప్రచ్ఛన్న క్రైస్తవంగా మలచడం తర్వాతి ఎత్తుగడ. యిదంతా చివరికి సాంకేతిక ఆరాధనలోకి మళ్లింది.

అసలు సంగతి క్రైస్తవం దైవం బయటివాడు, వస్తుగతమైన వాడు అని బోధిస్తుంది. అంటే బాహిరమైనదే సత్యం. ఆబ్జెక్టు సబ్జెక్టు పూర్తిగా వేరు. యిదే సరుకుల తత్వానికి మూలం. దీనినుంచే సాంకేతిక ఆరాధన మొదలైంది. ఎందుకంటే భారతీయుల దృష్టిలో దేవునికీ జీవునికీ సబ్జెక్టుకీ ఆబ్జెక్టుకీ దూరం లేదు. ఆ బేదాన్ని కల్పించడమే క్రైస్తవ నాగరికత.

## సాంకేతిక ఆరాధన

బ్రిటీషువారి నూతన సాంకేతికత పట్ల ఆరాధనాభావం ఆలోచనల్లో మౌలిక మార్పుకి కారణమైంది.

కన్ను గానని వస్తుతత్వాన్ని ఆంగ్లేయులు కాంచగలగుదురని గురజాడ కీర్తించాడు. యీ కీర్తనలో 'వస్తుతత్వము'. అనే దానికి ఆబ్జెక్టివ్ అనే అర్థం వుంది. కాని బ్రిటీష్‌వారు ప్రవేశపెట్టిన టెక్నాలజీకి స్వంత ప్రయోజనం వుంది. దాని వెనుక తన ఆధిపత్యాన్ని సామ్రాజ్యాన్ని కాపాడుకోవాలనే తపన వుంది. యీ సామ్రాజ్యవాదం సృష్టించబోయే విధ్వంసం సుదీర్ఘ కాలం కొనసాగేది.

ఐతే విజ్ఞానశాస్త్రాన్నీ సాంకేతికతనీ చూసి అబ్బురపడేస్థితి నుంచి, ఆరాధించే స్థాయివరకు పరిణామం జరిగింది.

కన్యాశుల్కంలో టెలిగ్రాం గురించి ప్రసక్తి వుంటుంది. బైరాగి మహిమల గురించి ప్రసక్తి వచ్చినపుడు వొక వ్యక్తి అంటాడు. "తెల్లోడు తీగటపాయేసినాడు. నిమేటికి ఉత్తరం దేశదేశాలకి యెల్లదా!" యిది టెలిగ్రాం గురించి ప్రసక్తి.

టెక్నాలజీ ప్రయోజనం వలస క్రైస్తవ సామ్రాజ్యవ్యాప్తేనని చరిత్రని పరిశీలిస్తే తెలుస్తుంది.

1840లో క్రైస్తవ మిషనరీలు భారతదేశమంతా క్రైస్తవ మతాన్ని వ్యాప్తిచేసి, సనాతన ధర్మాన్ని అణచివేయాలని సంకల్పించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ లక్ష్యం యిదే కావాలని భావించారు. ఒకేమతం, ఒకే రైల్వే వ్యవస్థ, ఎలెక్ట్రిక్ టెలిగ్రాఫ్ భారతదేశాన్నంతటినీ ఏకం చేసివేస్తాయి. యివే సనాతన ధర్మాన్ని కూడా అణచివేసి వొకే క్రైస్తవం గొడుగుకిందికి భారతదేశాన్ని తీసుకువస్తాయి. అని క్రైస్తవ మిషనరీలు భావించారు. (The last Moghal, William Dalymple 60వ పేజీ)

టెక్నాలజీ వెనక క్రైస్తవ వలసవాదుల ఏక ఛత్రాధిపత్య కాంక్ష వుందనే సంగతి మరువకూడదు. సామ్రాజ్యవాద ప్రయోజనం దాగివుందనే వాస్తవాన్ని విస్మరించకూడదు. టెక్నాలజీ భారతదేశాన్ని అంతటినీ వొకే పళ్లెంలో వడ్డించింది.

యీ టెక్నాలజీ ఉర్దూ కవి గాలిబ్‌ని ఆశ్చర్యంలో ముంచెత్తింది. టెలిగ్రాఫ్ అనేది యీ శతాబ్దపు అద్భుతం అన్నాడు గాలిబ్.

ప్రయాణ సాధనాల్లో, వినోద సాధనాల్లో వస్తున్న మార్పులు గాలిబ్‌ని ఆశ్చర్య చకితుణ్ణి చేశాయి. (The Last Moghal)

నిజానికి బ్రిటీష్‌వారి సాంకేతిక ప్రజ్ఞని చూసి అబ్బురపడడం ఎప్పటినుంచో మొదలైంది. 17వ శతాబ్దికి చెందిన వెంకటాధ్వరి విశ్వగుణాదర్శచంపువులో "విరచయతి వస్తు అద్భుతం" యింగ్లీషువాళ్ళు అద్భుతమైన వస్తువులు తయారు చేస్తారు అని వర్ణించాడు.

అద్భుతమైన వస్తువుల నిర్మాణం నుంచి సర్వ సమస్యలకీ పరిష్కారం పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రంలోనే వుంది అనే స్థాయికి ప్రశంసా భావం చేరుకుంది. దీనికి కారణం మాత్రం ఆంగ్లేయ విద్యా విధానమే. ప్రముఖ సంస్కర్త పెరియార్‌లో విజ్ఞానశాస్త్రం, టెక్నాలజీలపట్ల ప్రశంస వీరభక్తిగా బయట పడింది.

సమాచారాల మార్పిడి ఆకాశ మార్గంలో అత్యంతవేగంగాజరుగుతుంది అని మొదలుపెట్టి రేడియోలూ, విమానాలూ, చివరికి ఆహారం క్యాప్సుల్స్ రూపంలో లభించడం, జీవన ప్రమాణాలు పెరిగిపోవడం.. యిలా విజ్ఞాన శాస్త్రం ఎన్నో అద్భుతాల్ని సాధిస్తుంది అంటాడు. ఫలితంగా సోషలిస్టు సమాజం కూడా ఏర్పడుతుంది అంటాడు. చివరికి భూతల స్వర్గం ఏర్పడి దేవుడు రద్దు అవుతాడు అంటాడు. (India - A Million Mutinies Now, .S. Naipaul)

అంటే విజ్ఞానశాస్త్రం సర్వరోగ నివారణి అన్నమాట. దీనికి పూర్తి విరుద్ధమైన అభిప్రాయాలు హరికథాపితామహ ఆదిభట్ల నారాయణదాసుగారు వ్యక్తం చేశారు.

''టెలిగ్రాఫు పోస్టు, ఆనకట్టలు కట్టుట, పొగ యోడలు నడుపుట, బెలూన్‌లెగిరించుట, ఫోటోలు తీయుట, ట్రాము బండ్లు తోలుట, మోటారుబండ్లు నడుపుట విచిత్రములగు ఆయుధములు పన్నుట శస్త్ర చికిత్సను అభివృద్ధి పరచుట అన్నీ తెలిసినట్లుండి యేదీ తెలియక చచ్చుట కలిమాహాత్మ్యము. గోబ్రాహ్మణుల యెడ గౌరవము, సున్న. భక్తి జ్ఞాన వైరాగ్యములు శబ్ద మాత్రములయ్యెను. కోతులకు మనుష్యులకు నడుమ స్థితిగల మనుష్యుల వంటి మృగములు భరతవర్షమున పుట్టి పెరుగుచుండెను. (నా యెరుక – ఆదిభట్ల నారాయణదాసు)

పెరియార్, ఆదిభట్ల నారాయణదాసుగార్ల అభిప్రాయాలు పూర్తిగా భిన్నమైనవి; విరుద్ధమైనవి.

వలసవాద నాగరికతపైన, విజ్ఞాన సాంకేతిక రంగాలపైన విమర్శను ఎక్కుపెట్టి వాటి మరో ముఖాన్ని చూపిన మేధావి విశ్వనాథ సత్యనారాయణ. అది ప్రకృతి విధ్వంసం.

ప్రకృతి విధ్వంసం గురించి మాట్లాడిన ప్రగతిశీల మేధావులు ఎవరూ ఆనాడు కనబడరు. సుబ్బన్నపేట తీవ్రంగా ఆధునీకరించబడడంతో మేఘం, ఆ వూరిని కనుగొనలేక యెటో వెళ్ళిపోతుంది వేయి పడగలు నవలలో విశ్వనాథ సత్యనారాయణగారు కాలానికి ఎదురీదారు. కాలంతోపాటు సమాంతరంగా పరిగెత్తడమంత దౌర్భాగ్యం మరేదీ లేదు. ముందుకు అడుగు వెయ్యడం కాదు, వెనుకకు అడుగు వెయ్యడం, పక్కకి అడుగు వెయ్యడం కూడా తెలియాలి.

ఎందుకంటే కాలం అనంతం. కాల విభజన కల్పితం అనేది భారతీయ తాత్వికదృష్టి.

యీ దృష్టిని ఛేదించి కాలాన్ని బాణంలా చూడడం ఆంగ్లేయ విద్య వలన అబ్బినజబ్బు. యీ వ్యాధి వల్లనే మనం బ్రిటీష్ సాంకేతిక జ్ఞానానికి బానిసలమయ్యాం. గ్లోబలైజేషన్‌కి ద్వారాలు తెరిచాం.

అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష. మన రైయిళ్ళూ గియిళ్లూ కూడా వేదాల్లోనే వున్నాయిట అంటాడు అగ్నిహోత్రావధాని. యిదొక వెటకారంగా కనబడ్తుంది. కాని పూర్తిగా వెటకారం కాదు. క్రైస్తవ విజ్ఞానానికి స్థానికత కల్పించడంకోసం యిటువంటి భావాలు వ్యాప్తిలోకి రావడం మంచిదేనని గురజాడ భావించాడు.

"ఈ భూప్రపంచంలో యేదీ కొత్తది కాదని పూర్వాచార పరాయణులైన హిందువులందరి నమ్మకం. నేటి అంగుష్ఠమాత్రుల దృష్టిలో అద్భుతమైనవిగా కనిపించే నూతన కల్పనలన్నీ, ఎంతో మౌలికమైనవిగా అగుపించే భావాలన్నీ మన ప్రాచీనులకి తెలుసునని వారి అభిప్రాయం" (గురజాడ)

ఆధునిక సైన్సు అంతా టెక్నాలజీ అంతా వేదాల్లో వుందని ఆర్య సమాజికుడు, దయానంద సరస్వతి ప్రచారంలోకి తెచ్చాడు. యిటువంటి అభిప్రాయాల్ని ఖండించడు గురజాడ. యీ అభిప్రాయాలు క్రైస్తవ విజ్ఞానానికి స్థానికతనీ ఆమోదాన్నీ కలగజేస్తాయి. గురజాడ గొప్ప ప్రాగ్మాటిస్టు.

విజయనగర కళాశాలలో సంస్కృతాచార్యులుగా పనిచేస్తున్న నారాయణ శాస్త్రి రచించిన శ్రీరామ విజయ వ్యాయోగ నాటకాన్ని మెచ్చుకుంటూ ముందుమాట రాశాడు గురజాడ. యీ నాటకంలో రైలూ, విమానయానం ఆధునిక ఆయుధాలూ యివన్నీ రామాయణ కథలో భాగమైపోతాయి.

పురాణకథల్లో ఆధునిక సాంకేతిక విజ్ఞానానికి సంబంధించిన వర్ణనలు ఉండడాన్ని వైరుధ్యంగా భావించడు గురజాడ.

ఐతే దీనివల్ల పౌరాణిక అద్భుతాల స్థానాన్ని సాంకేతిక అద్భుతాలు ఆక్రమించాయి. దైవిక శక్తులకి స్థానం లేకుండా పోయింది.

"వాస్తవంలో మానవాతీత శక్తికి చోటులేకుండ చేయడం దైవదూషణగా పూర్వాచార పరాయణులు భావిస్తారు". అంటాడు గురజాడ. యిక్కడ మంత్రం స్థానాన్ని యంత్రం ఆక్రమించింది. యిక్కడ పురుషోత్తముడు రాముడు కాదు. రాముని రూపంలోని జార్జి చక్రవర్తి. (నేడు జార్జిబుష్) యిక్కడ పెరియార్ లాంటి నాస్తికుల క్రైస్తవ విజ్ఞాన భక్తి రామకథ వేషం వేసుకొంది. యీ పండితుడు పాశ్చాత్య విమర్శ సూత్రాలకు అనుగుణంగా సంస్కృత నాటక రచన చేసినందుకు మెచ్చుకుంటాడు గురజాడ.

యిది కేవలం ఆధునిక సైన్సు పట్ల భక్తి భావమే కాదు. దాన్ని నడిపిస్తున్న క్రైస్తవ సామ్రాజ్యం పట్ల భక్తి కూడా. అయోధ్యలో రామచంద్రునికి ఆహ్వానం పలకడానికి భరతుడు చేసిన సన్నాహాలు గవర్నరు కళింగ రాజధాని సందర్శన స్మృతులను గుర్తు చేస్తుందంటాడు గురజాడ.

ఆధునిక విజ్ఞానం, టెక్నాలజీ, క్రైస్తవ సామ్రాజ్యం యివన్నీ విడదీయరానివి. వీటిపట్ల భక్తి కూడా అవిభాజ్యం.

క్రమేపీ సంస్కృత పండితులు కూడా క్రైస్తవ సామ్రాజ్య భక్తులుగా మారిపోయారు. ముఖ్యంగా కలకత్తా, విజయనగరాలు జంట నగరాలుగా మారాయి. యీరెండు క్రైస్తవ సామ్రాజ్య దాస్యానికి నిలయాలుగా కూడా మారాయి. గురజాడలాంటివారు ఆ కోవకి చెందినవారే. గురజాడ క్రైస్తవ సామ్రాజ్యానికీ క్రైస్తవ విద్యావిధానానికీ స్థానికతని కల్పించడానికి కృషి చేశాడు. అందుకు తండ్రినుంచి అబ్బిన సంస్కృత పాండిత్యం సహకరించింది.

అందరూ బానిసలేనని చెప్పడానికి నేను సాహసించడంలేదు. కలకత్తాలో కూడా ఏటికి ఎదురీదిన పండితులు ఉన్నారు. ఆకారంలో మాత్రమే భారతీయత మిగలాలని ఆశించిన లార్డ్ మెకాలే కలకత్తా ప్రభుత్వ సంస్కృత కళాశాలలో ఉన్నతస్థానం అలంకరించడంతో పండిత హంసల రెక్కలు తెగిపోయాయి. వారు తీవ్ర వివక్షకి గురయ్యారు. సంస్కృత కళాశాలని మూసి వేయించాలని, అమరభాషకు స్థానం లేకుండా చెయ్యాలని మెకాలే దీక్ష.

అప్పుడా పండితులు విదేశంలో వున్న విల్సన్ అనే ఆంగ్ల సంస్కృత పండితునికి తమగోడు వెల్లడించుకొన్నారు. విల్సన్ విష్ణు పురాణాన్ని ఆంగ్లంలోకి అనువదించిన పండితుడు, ఆ కళాశాలలోనే పూర్వం ప్రిన్సిపాల్‌గా పనిచేశాడు. సహృదయుడు. జయగోపాల తర్కాలంకారుడు అనే సంస్కృత పండితుడు విల్సన్‌కి యీ శ్లోకం వ్రాసి పంపాడు.

అస్మిన్ సంస్కృత పాదపద్మ సరసి త్వస్థాపితా యేసుధీ
హంసాః కాలవశేన పక్షరహితా దూరం గతే తేత్వయి

సంస్కృత భాష అనే పద్మనిలయమైన సరస్సులో పండితులనే హంసలు నివసిస్తున్నాయి. వాటి రెక్కలని వేటగా ఖండించివేశాడు. నీవే మాకు దిక్కు అని వేడుకున్నాడా పండితుడు ఆ వేటగాడే లార్డ్ మెకాలే.

విల్సన్ ఏం చేయగలడు. ఆయన సమాధానం యిది.
విధాతా విశ్వనిర్మాతా, హంసాస్తత్ప్రియ వాహనమ్.

విశ్వమును సృష్టించిన బ్రహ్మకి వాహనం హంస. కనుక హంసలని ఆ భగవంతుడే రక్షించాలి. (పురాణ పర్యాలోచనం – శ్రీకృష్ణ మణిత్రిపాఠీ చౌఖంబా కాశీ – 2006) వొకవైపు సంస్కృత పండితులు కూడా క్రైస్తవీకరించబడి చివరికి యాంత్రీకరించబడి గురజాడలాంటి ప్రచ్ఛన్న క్రైస్తవుల ప్రశంసలు పొందారు. మరోవైపు అదృశ్యరాక్షసుని వలె భారతీయ ఆత్మల్ని ఆక్రమించుకోవాలని చూస్తున్న లార్డ్‌మెకాలే లాంటి సాంస్కృతిక నియంతల చేతిలో రెక్కలు కత్తిరించబడి కూడా. సంప్రదాయ పరంపర విచ్ఛిన్నం కాకుండా పోరాడిన పండితులు కూడా వున్నారని చెప్పడమే నా ఉద్దేశ్యం.

వలసవాద సంస్కృతి వల్ల కోతులకు మనుష్యులకు మధ్యస్థితిలోని జంతువులు ఆవిర్భవించాయని ఆదిభట్ల నారాయణదాసుగారు అన్నారు. దీని తర్వాతి యంత్రానికీ మనిషికీ మధ్యస్థితి. మనం ఆ దశలో వున్నాం. దీనినంతటినీ స్థానికీకరించడానికి కృషి చేసిన మేధావి గురజాడ.

వసుధైక కుటుంబకం అంటే గ్లోబలైజేషన్ అని ప్రకటించి పాశ్చాత్య సామ్రాజ్య వాదాన్ని మరింత ముందడుగు వేయించిన గురజాడ వారసుడు పివి నరసింహారావు. యీయన వేయిపడగలు నవలని సహస్రఫణ్ పేరుతో హిందీలోకి అనువదించాడు. యిదొక వైరుధ్యం వేయి పడగలని భుజాన మోయడం ద్వారా యీ అత్యాధునిక దుబాసీ దానిలోని సారాన్ని మింగేశాడు. ఆ గ్రంథంలోని ప్రకృతి ఆరాధనని, గ్లోబలైజేషన్ వ్యతిరేకతని గ్రామీణతనీ మరుగుపరిచి, దానివల్ల వచ్చే ప్రమాదాన్ని అరికట్టాడు. యాంత్రిక నాగరికత ద్వారా అంతటినీ చదునుచేసి క్రైస్తవీకరించాలన్న మొదటితరం మిషనరీల ఆదర్శాన్ని పరిపుష్టం చేశాడు.

## వైరుధ్యాల్ని సృష్టించింది ఆధునికతే

నిజానికి కొత్త – పాత, మంత్రం – యంత్రం, మానుషం – దైవికం, శబ్దం – అర్థం యీ వైరుధ్యాలన్నీ వలసవాద సృష్టి మాత్రమే. వాగర్థావివ సంపృక్తౌ పార్వతీ పరమేశ్వరులవలె శబ్దమూ అర్థమూ విడదీయరానివి.

అవ్యక్తంపైన వ్యక్తాన్ని కాపలాగా నిలిపాడు ప్రముఖ మనస్తత్వ శాస్త్రవేత్త ఫ్రాయిడ్. ధర్మకామాలపై అర్థాన్ని నిలిపాడు మార్క్సు పదార్థంపై దైవాన్ని అధినేతగా నిలిపింది క్రైస్తవం. జీవజాలంపై మనిషిని అధిపతిగా నిలిపింది ఆధునికత. మానవుడిపై యంత్రాన్ని అధిపతిగా నిలిపింది అత్యాధునికత.

యిలా ద్వంద్వాల మధ్య వైరుధ్యాల్ని సృజించి వొకదానిపై మరొకదాని ఆధిపత్యాన్ని అప్రతిహతంగా కొనసాగించడమే ఆధునికత.

మరోవైపు కూడా చూడమని సనాతనం హెచ్చరిస్తుంది. ముందుకు అడుగు వెయ్యడం కాదు. ముందేమీ లేదు అగాధం తప్ప. గతంలేనిదే నువ్వే లేవు. స్మృతిలేనిదే ఉనికి లేదు. సృష్టిలేదు. స్మృతిపై గతిని నిలుపుతుంది ఆధునికత. వొక క్షణం గడిస్తే

చాలు అదే నాకు గత శతాబ్ది అంటాడు శ్రీశ్రీ.

వర్ణాలు పుట్టి వెంటవెంటనే నశిస్తున్నాయి అని బౌద్ధం అంటుంది. శబ్దాన్ని క్షణికం అంటుంది. అప్పుడు శబ్ద బోధే అసాధ్యం అని ఖండిస్తుంది. సనాతనం (నిరుక్తం – యాస్కుడు) అందువల్ల శబ్దం నిత్యం; అది అనాది, అదొక పరంపర. క్షణికమైన ఉచ్చారణ వెనుక నిత్యశబ్దం వుంది.) దీన్ని మరచి అనాది పరంపరపై వ్యక్తిని నిలుపుతుంది ఆధునికత. అదే గొప్ప విధ్వంసానికి విచ్ఛిత్తికీ కారణం.

నిర్గుణం, అనిర్వచనీయం అనే భావాలకి భారతీయతత్వంలో చాలా ప్రాధాన్యం వుంది. దేవుడు ఉన్నాడా, సృష్టికి మూలం ఏమిటి లాంటి ప్రశ్నల్ని అవ్యాకరణీయ ప్రశ్నలు అంటాడు బుద్ధుడు. అంటే సమాధానం చెప్పకూడని ప్రశ్నలు.

సృష్టినీ, ప్రకృతినీ, ఉనికినీ ప్రతిదాన్నీ ఛేదించవచ్చుననీ, అర్థం చేసుకోవచ్చుననీ ఆధునికత అహంకరిస్తుంది. ఆఅహంకారంపై యిప్పటికే ప్రకృతి పెద్ద దెబ్బ కొట్టింది. యీనాటికీ ప్రకృతిపై మానవుడే విజేత అనే దురహంకారాన్ని విడవకపోతే, మందగించక ముందుకు అడుగువేసేది అగాధంలోకే, ప్రళయంలోకే. యిదే సనాతన సందేశం.

స్థూలం నుంచి సూక్ష్మానికి చేరుకోవడమే జీవిలక్ష్యం. సూక్ష్మంలో స్థూలం వుంటుంది కాని స్థూలమే సూక్ష్మం ఏనాడూ కాదు. విత్తులోనే చెట్టు వుంది. చెట్టే విత్తుకాదు. వికాసం స్థూలమైనది. వస్తు వికాసానికి మానవుడి అభివృద్ధికీ మితిమీరిన ప్రాధాన్యం యివ్వడం అవివేకం.

నేడు శాస్త్రీయ దృష్టి హేతువాదాల పేరుతో చలామణి అవుతున్నదంతా స్థూలదృష్టే.

అది అంతర్ముఖత్వానికి శాశ్వతంగా తలుపులు మూసేసింది. బహిరమైనదే స్థూలమైనదే దృష్టికి సుస్పష్టంగా గోచరించేదే సత్యమనే స్థూలబుద్ధికి కారణమైంది. గర్భస్థ శిశువు కంటే నేలమీద తచ్చాడే మానవుడే జ్ఞానియనే అజ్ఞానానికి కారణమైంది. శిశువుకంటె ప్రౌఢుడు శ్రేష్ఠుడనే వర్గీకరణకు కారణమైంది.

వస్తువుల సరుకుల విజృంభణకి, తీవ్రయాంత్రీకరణకు దారితీసిన యూరప్ ప్రాచ్యం కంటే ప్రౌఢమైనదనే మూర్ఖచింతనకు మూలమైనది. సూక్ష్మంకంటే స్థూలం ఏనాడూ ప్రామాణికం కాదు. పార్థివదేహం కంటే యింద్రియాలూ, యింద్రియాలకంటే మనస్సు, మనస్సుకంటే బుద్ధికంటే, ఆత్మ సూక్ష్మమైనవి. ఆత్మ దృష్టి గోచరం కాకపోవడమే కాదు మనోబుద్ధులకి కూడా అందదు. వాక్కులు అక్కడికి చేరలేవు. కాని ఆత్మ అనేదే అంతసూత్రం. నేను అనేది లేనిదే జాగ్రత్ స్వప్న సుషుప్తులలో నడయాడే జీవికి జీవిత్వం సిద్ధించదు. ఉనికి అనేదే వుండదు.

ఉనికిని ముంచేసే స్థూలవస్తుజాలం, సరుకుల మాయ స్థూలప్రపంచంలో విహారాన్నే జీవితంగా భ్రమింపజేస్తుంది. ధనస్వామ్యాన్నే సత్యంగా భ్రమింపజేస్తోంది. మనం స్థూలం నుంచి సూక్ష్మానికి, వికాసం నుంచి బీజస్థితికి, సంఘటనల గందరగోళం నుంచి ఉనికికి ప్రయాణించినప్పుడే వొక సూత్రం అంతసూత్రం పట్టుబడ్తుంది. అప్పుడు యాంత్రీకరణనుంచి జీవితం బయటపడ్తుంది. సహజస్పందనలని తిరిగి పొందుతుంది. హృదయం సహజస్పందనని పొందుతుంది. అప్పుడు మనిషేకాదు పశు పక్ష్యాదులేకాదు సకల వస్తుజాలమూ జీవలక్షణంతో తొణికిసలాడ్తుంది. సకల నక్షత్రాలూ గోళాలూ దైవనిలయాలుగా జీవనిలయాలుగా గోచరిస్తాయి. ఏదీ ప్రాణరహితం కాదు, నిర్జీవం కాదు యాంత్రికం కాదు గ్రహాంతరాలలో కాదు మనలో మటుమాయమైన జీవ లక్షణాన్ని తిరిగి పొందినపుడు మాత్రమే మనం యంత్రాలుగా యంత్రాలు ఉత్పత్తి చేసే వస్తువులుగా మార్కెట్ మాయలో కొట్టుకుపోతున్న సరుకులుగా కాక అనంత జీవజాలంలో జీవులుగా చలిస్తాం. అదే జీవుని వేదనకి పరిష్కారం, సనాతనం.



## రాణి శివశంకరశర్మ

"ది లాస్ట్ బ్రాహ్మిణ్" గ్రంథం ద్వారా తెలుగు సాహిత్య లోకంలో సుప్రసిద్ధుడైన రచయిత రాణి శివశంకరశర్మ. వీరు 1966లో కోనసీమలోని మోడేకుర్రు అనే గ్రామంలో జన్మించారు. బాల్యంనుండే సంస్కృత భాషని, వేదాంత, వ్యాకరణ శాస్త్రాలని సంప్రదాయ పండితులవద్ద శాస్త్రపద్ధతిలో అభ్యసించారు.

వీరు తెలుగు, సంస్కృత భాషలలో ఎమ్.ఏ పట్టాని పొందటమే కాక, ఈ రెండు భాషలలోను చాల రచనలు చేశారు. వీరి రచనలు ప్రసిద్ధ దిన, వార పత్రికల్లోనూ, వివిధ సంకలనాలలోను ప్రచురించబడ్డాయి. తెలుగు భాషలో కథలూ, వ్యాసాలనెన్నింటినో శర్మగారు రచించారు. వీరు రచించిన "ది లాస్ట్ బ్రాహ్మిణ్" గ్రంథం తెలుగు సాహిత్యరంగంలో తీవ్ర సంచలనం సృష్టించి, కులమతాల గురించి తీవ్రచర్చను లేవదీసింది. ఈ గ్రంథం ఆంగ్ల, కన్నడ భాషలలో కూడా అనువాదమైంది. వీరి ఇతర రచనలు: 1) గ్రహాంతరవాసి, 2) పురాణవేదం, 3) అమెరికనిజం మొదలైనవి.

వీరు 'హిందుత్వ' అనే నృత్యరూపకాన్ని కూడా రచించారు. దీనిని ప్రముఖ కూచిపూడి కళాకారిణి స్వాతి సోమనాథ్ ప్రదర్శించారు.

శర్మగారు చాలా కాలం విరసంలో సభ్యునిగా ఉన్నారు. దళితవాదులతో కలిసి స్నేహపూర్వకంగా వుండటమే కాక, సంఘీభావ రచనలు కూడా చేశారు. ప్రముఖ దళిత కవి మద్దూరి నగేష్ బాబుతో కలిసి "ఊరు, వాడ" అనే సంకర కవిత రచించారు. ఈయన తన రచనల ద్వారా విప్లవ దళితవాద సాహిత్యాన్ని పునర్మూల్యాంకనం చేశారు. వలసవాదంపై ఆధునికతపై, తీవ్ర విమర్శను కొనసాగిస్తూ రచనలు చేస్తున్న మేధావి రాణి శివశంకరశర్మ.